# యుగాంతకాని మగడు

గ్రంథకర్త:

ఎ. భాస్కర రామమూర్తి బి. ఏ.





పబ్లిషర్సు

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

1949



వెల రు 1—0—0

# విషయసూచిక








శ్రీ కొండపల్లి ముద్రాక్షరశాల—రాజమండ్రి.

# లుక్రీసు అను పతివ్రత



పూర్వము 'టార్క్విన్' అనురాజు 'రోము' అను దేశమును పాలించుచుండెను. ఆతనికి 'కొల్లాటిను' అను సేనాని కలడు. వారిద్దరకిని, ఉద్యోగసంబంధమే గాక, బంధుత్వము కూడ గలదు. మిక్కిలి స్నేహితులు.

ఒకప్పుడు 'రోము' రాజ్యమునకు 'ఆర్డియా' యను పట్టణవాసులతో యుద్ధము సంభవించెను. ఆయుద్ధమునకు 'టార్క్విను' కొ... ను, వెళ్లెను. ఆర్డియా పట్టణమును ముట్టడించిరి.

ఒకనాడు సైనికులు తమలో తాము వారి వారి భార్యల సుగుణములను గూర్చి ముచ్చటించుకొనుచు, ప్రతివాడును తన భార్యయే మిక్కిలి సుగుణవతియని చెప్పుకొనిరి. వాదము ఐన పిదప అందరును తమయిండ్లకు బోయిరి. అప్పటికి నాలుగుజాముల రాత్రి అయ్యెను. ప్రతి సైనికుని భార్యయు నిద్రపోవుచునో, పాట పాడుకొనుచునో లేక స్నేహితురాండ్రలతో కబుర్లు చెప్పుకొనుచునో యుండెను. కాని మన సేనానాయకుడగు 'కొల్లాటిను' భార్యమాత్రము, భర్తయాజ్ఞ ప్రకారము ఒక రాట్నముతో నూలు వడుకుకొనుచు భర్తరాకకై యెదురు చూచుచుండెను. ఆమె పేరు 'లుక్రీసు.' సైనికులందరును, రాజైన 'టార్క్విను' గూడా 'లుక్రీసు' పతిభక్తికి, గృహిణీ ధర్మమునకు చాల మెచ్చుకొనిరి.

'లుక్రీసు' చాల సుగుణవతి. మిక్కిలి సుందరరూపి. ఆకాలమున ఆమె సౌందర్యము అసమానమైనదిగ పరిగణింపబడుచుండెను. భర్తయగు 'కొల్లాటిను' మాట జవదాటక మిక్కిలి యణుకువతో కాపురము జేయుచుండెను.

'టార్క్విను' యీయామె సౌందర్యమును జూచి చాల యద్భుత పడెను. ఈమె నెట్లయినను లోబరచుకొని తనకోర్కె తీర్చుకొనవలె నని సంకల్పించెను.

'అర్డియా' యుద్ధము యింకనూ ముగియలేదు. రాజగు 'టార్క్విను' లుక్రీసు భర్తయగు 'కొల్లెటిను' మిగిలిన సైనికులు బహుభయంకరముగా యుద్ధము నడుపుచుండిరి. ఇది చాలమంచి సమయమని 'టార్క్విను' తలచెను. తన 'పవరు' అంతయు కొల్లెటునకిచ్చి యిట్లనెను. 'కొల్లెటిను మిత్రమా! నేను కొన్ని రాచకార్యముల నిమిత్తము రాజధానికి పోవలసియున్నది. నాపవర్సు నీస్వాధీనముచేసి పోవుచుంటిని యుద్ధమంతయు నాస్థానే నీవేజరిపి మన 'రోము' రాజ్యముకు జయము సమకూర్చవలెను. వీలైనచో తిరిగి 3. 4 రోజులలో నిన్ను కలసికొందును' అని చెప్పి టార్క్విను, వెంటనే బయలుదేరి కోటకు వచ్చెను. అచ్చట దుస్తులుమార్చి సామాన్యునివలె సాధారణ వస్త్రములుకట్టుకొని తిన్నగా 'లుక్రీసు' యింటికి జేరుకొనెను.

తనమానముకొల్లగొట్టుటకు యీదుర్మార్గుడు వచ్చెనని లుక్రీసుకు తెలియదు. రాజువచ్చెనని ఆమె గృహస్థుధర్మముగ లోనికిరానిచ్చి యుద్ధవిశేషములడిగెను. ముఖ్యముగతనభర్తకొల్లెటిన్ క్షేమమడిగెను బంధుత్వము కూడనుండెను కావున, బంధుమర్యాదంతయు జూపెను. టార్క్విను ఆమె సుగుణసంపత్తినిజూచి నిమిష నిమిషమునకును అచ్చెరువందజొచ్చెను. ఇదివఱకెన్నడును వలలోచిక్కని పక్షి వల యననేమో యెఱుగక, భయపడనట్లు; యీటార్క్విను దుర్మార్గుని దుర్మార్గమును గూర్చి యీముద్దరాలు అవంతయు ననుమానపడదయ్యెను. ధనవంతుడగుటచే గౌరవమును, బంధువగుటచే ఆతిథ్యమును, భర్తక్షేమసమాచారముదెచ్చుటచే స్వాగతమును, ఆతని

కిచ్చెను. నీటిలోతున్నైన సులభముగ గనిపెట్టవచ్చును గాని మానవుని మనస్సెవడుకనుగొనగలడు?

'టార్క్విను' అట్లువచ్చినవాడు భోజనముచేసిన పిదప లుక్రీసుతో సంభాషించుచు ఆమెభర్తయగు కొల్లాటినునుగూర్చి ఎంతో ప్రశంసించెను. సేనానాయకులలో 'కొల్లాటిను' కంటె అధికుడెవడును లేడనెను. అతడుచేసిన యుద్ధములును, పొందిన జయములును, చూపిన ధైర్యసాహసములను, యేకరువుపెట్టజొచ్చెను. ఇదంతయు విని అమాయకయగు లుక్రీసు సంతోషముతో ఉబ్బిపోయెను.

టార్క్విను, తానామెయింటికి యేపనిమీదవచ్చెనో చెప్పక, యేలవచ్చితినా యనునట్లు ప్రవర్తింపుచు, అతివినయముగను, అతిస్నేహముగను లోనిదుర్మార్గము నేమాత్రమును బయల్పెట్టక మాట్లాడజొచ్చెను. సాయంసమయ మయ్యెను. క్రమముగ చీకటి నలుదిశల వ్యాపించెను.

టార్క్విను హృదయములోని తుచ్ఛవాంఛ తీవ్రముగనుండెను. భోజనానంతరము తనకేర్పాటుచేయబడిన గదిలోపరుండి ఆలోచనానిమగ్నుడయ్యెను.

పట్టణమంతయు గాఢాంధకార బంధురమయ్యెను. ... మున దుష్టస్త్రీలకు, త్రాగుబోతులకు, చోరులకుదప్ప మిగిలినవారికెల్లఅకును రాత్రియే విశ్రాంతి సమయము, దూరముననున్న పొలములలోని నక్కకూతలు, యింటిప్రక్కను కీచురాయిధ్వని తప్ప మఱియే యితరధ్వనులు లేక ప్రశాంతముగానుండెను.

'టార్క్విను' తనకోరిక నెఱవేర్చుకొనుటకు తీవ్రయోచన జేయుచుండెను. ఒకవైపు ధర్మము, మఱియొకవైపు అధర్మము ఒకవైపునీతి మఱియొకవైపు అవినీతి ఒకపక్కభయము, మ...

కాని పదినిమిషములైనపిదప, కామమను పెనుభూతమా తుచ్ఛుని హృదయము నాక్రమించ, నతడిట్లనుకొనజొచ్చెను.

'ఛీ, నేనెట్టి పిఱికిపందను? నేనేమైన ఘోరహత్య జేయుచుండుటలేదే! నాది యౌవనము. దానికి ఫలితము అందము. లుక్రీసు అందగత్తె; ఆమెను అనుభవించుట నావిధి.'

అనుచు మెల్లగ తనప్రక్కపైనుండి లేచెను. ఆతని హృదయములో 'లుక్రీసు' చిత్రపటము లిఖింపబడెను. కాని ఆప్రక్కనే 'కొల్లెటి'ను చిత్రముకూడ అగపడజొచ్చెను. ఒక అడుగుముందుకు వేయ రెండడుగులు వెనుకకు పడుచుండును. కాళ్ళు దడదడ కొట్టుకొనుచుండెను. ఒకవైపు కామాతురత, రెండవవైపు భయానకము; ఆతనిని తొందరపెట్టుచుండెను. క్రమముగ అతడు 'లుక్రీసు' పండుకొనియున్న గదివైపు బయలుదేరెను. కాని ఆమె గదిలోపల గడియ వేయబడి యుండెను. ఆగడియ, యీవలనుండి, మేకుత్రిప్పినచో విడిపోవునాయని టార్కిను ప్రయత్నించెను. అది నెమ్మదిగా ఏధ్వనియు లేకుండ యీవలనుండియే మేకుత్రిప్ప, పాపుల కెన్నడు సా వియ్యని 'లుక్రీసు' గది యీపాపునికి తావిచ్చెను.

'టార్కిను' భగవంతుని అనేకవిధముల తనకు కార్య సాఫల్యము కలిగించవలెనని కోరును. ఆకోరునప్పుడు తాను చేయబోవునది పాపమే యని ఒప్పుకొనును. దీనికంతకు తన యౌవనమే కారణమనును.

గదిలో కాలిడినపిదప నాల్గుమూలలు జూచెను. చిన్న దీపము నిష్కళంకముగ వెలుగుచుండెను. ఒకవైపు 'లుక్రీసు' సగముకుట్టిన జేబురుమాలు గోడమేకునకు తగల్చబడెను. అది అతడు తీసి చూడబోవ దానినున్న సూది 'టార్కిను'కు గుచ్చుకొనెను. 'ఓదుర్మార్గుడా యీమె మా 'లుక్రీసు' మహాపతివ్రత. యీమెను ముట్టినచో నీకు

ప్రాయశ్చిత్తమగును రాయని చెప్పెనో యనునట్లాసూది యాతని వ్రేలుకు గ్రుచ్చుకొన, దొంగకు తేలుకుట్టినరీతిని రక్తపుచుక్క తుడుచుకొని, ఆరుమాలు యథాస్థానమున బెట్టెను.

మేఘాచ్ఛాదితమైన నిండుచంద్రునివలె, 'ల్యుక్రీసు' తనమంచముపైని నిద్రబోవుచు, దోమతెరచే ఆవరించబడియుండెను. ఆమె ముఖచంద్రుని జూడగోరి, యాతుచ్ఛుడగు టార్క్విను, మంచముకు నాల్గుప్రక్కలను తిరిగెను.

కొంతసేపట్లు తిరిగినవాడై చివరకు, తెర పైకిలాగెను. మబ్బుగ్రమ్మిన సూర్యుడు మబ్బువిడిపోవగనే తనకాంతిచే మనకన్నులనెట్లు మిరుమిట్లుగొల్పునో ఆవిధముగ, తెరదీయగనే టార్క్విను' కన్నులు 'ల్యుక్రీసు' వదన తేజముచే మిఱుమిట్లు గ్రమ్మెను.

ఆహా! నిష్కళంక తేజోవిరాజియను యా 'ల్యుక్రీసు' యువతి కెట్టి యాపద రానై యున్నది. మహాపతివ్రతలను తాకినంతమాత్రమున తలబ్రద్దలై చత్తురందురే! ఈమెవిషయముగూడ నట్లగునా అయ్యో కలికాలములో భగవంతుడంత నాకొత్కరించునా?

'ల్యుక్రీసు మెత్తనిహస్తములు ఆమె శిరస్సుక్రింద నుంచబడి యుండెను. ఆమె తల మృదువగు తెక్కెముపై నానియుండెను. రెండవ హస్తము పఱుపుపై వ్రాలియుండెను. నవకోమలములగు ఆమెకురులు ఆమె ఊపిరివలనగాలిచే నిటునటు కదలుచుండెను.

ఆమె పెదవులు కెంపులను బోలెను. ఆమె నాశికసంపెగను బోలెను. ఆమె నేత్రములు మీనములబోలెను. ఆమె వదనము చంద్ర బోలెను. ఆమె కురులు నదీప్రవాహమును బోలెను. ఆమె హస్తములు మృదు పల్లవములబోలెను. ఆమె శరీరము, లతను బోలియుండెను,

'టార్క్విను' యొక కాలగూాపన చేయక నెమ్మదిగ ఆమె మంచముపై కూర్చుండెను. తనచేతిని ఆమె వక్షస్థలముపై వైచెను.

ఆహా! సుఖనిద్రలోనున్న యొక స్త్రీరత్నము. భర్త గ్రామాంతరము, పోవుట, బంధువుడై ఒకడు మూడవచ్చుట, అర్థరాత్రము, నిస్సహాయురాలు, దుర్మార్గుడు, మంచముపై కూర్చుండుట వక్షస్థలముపై చెయివేయుట ఘోరము, ఘోరము.

'లుక్రీసు' వెంటనే కన్నులు తెఱచినది. చూచినది. కలయో నిజమో యెఱుగదు. తిరిగి చూచినది. హఠాత్తుగ తన చేతితో ఆతని చేయి అవలకు త్రోసివైచినది. అది కలగాదు నిజమే. ఆమె కప్పుడు గలిగిన భయసంభ్రమములు. ఆత్రోటుపాటు ఆ వేదన యెవరు వర్ణింపగలరు.

పరమేశ్వరుడు దిక్కగునా? ఆమె పాలిట సాక్షాత్కరించునా? ఆమె గుండెలు దడదడ కొట్టుకొనుచుండెను. వడలు గగుర్పొడిచెను. అశ్రువులు రాలెను. చేతులతో నెత్తి దబదబ మొత్తుకొన, ఆతడు తిరిగి ఆమె వక్షముపై చేయిడొప్ప ఆమెతో నిట్లనెను.

'ఓ యువతీ నీయందు నాకున్న గాఢానురాగమే నన్నీపనికి ప్రేరేపించినది. యిది మిక్కిలి అన్యాయమని యెరుగుదును. తుచ్ఛమని యెరుగుదును. పాపమని యెరుగుదును. దైవము దూషించునని యెరుగుదును. ఐననేమి, నాప్రేమ మిక్కుటమైనది. నాకోర్కె దాట శక్యముకాదు. అది సఫలమై తీరవలెను. తప్పను తప్పదు. ఈనా చేష్టకు ఎట్టెట్టి ఫలితములను నేననుభవించవలసి యున్నదో నాకు తెలుసును. ఈ నేచేయబోవు మహాదారుణము నేనెన్ని యుపద్రవములైన ననుభవించవలసియున్నది. దీనికంతకు నీవే కారణమవు. నీ యందమే కారణము.' అనుచు; డేగ పావురమును చుట్టునట్లు ఆమెను కదల్చివైచెను. ఆతడు తిరిగి ఆమెతో'

'ఓ లుక్రీసూ, నే చెప్పబోవు చివఱమాట వినుము. నాకోర్కె నీవు సఫలముచేసి తీఱవలెను. అట్లు చేయవా యిదిగో' (అని తన ఒఱలోని బాకు నామెకు జూపుచు) దీనితో నిన్ను పొడిచి చంపుదును. వెంటనే వీధిలోనికిపోయి యేదురదృష్టపువానినో చంపి వాని కట్టెను నీప్రక్కలో పెట్టెదను పిదప ప్రపంచమునకు యీరీతిని చాటెదను 'లుక్రీసు యీవిధంతో చరించుచుండగా నేనుజూచి అది సహించలేక వీరినిద్దరిని పొడిచిచంపి; నాస్నేహితుడగు కొల్లాటిను గౌరవము కాపాడితిని. అని ప్రపంచములో చాటెదను. అంతట నీమగడు కొల్లిటిను, నన్ను మెచ్చుకొనును. నిన్ను ప్రతివారును, తిట్టి నీకళేబరమును కాకులకు, గ్రద్దలకు గిరవేయుదురు. శాశ్వతమైన అపకీర్తినీకు నీకుటుంబమునకు ఘటించును. 'లుక్రీసు' వట్టి జారిణి యని లోకములో నీ పేరున పాటలుపద్యములు రచింపబడి, నీకు, నీమగనికి నీవంశమునకు దుష్కళంకము కలుగును.

అట్లుగాక నాకోర్కె తీర్చుదువా, యిదిగో యీసంగతి హరిహరబ్రహ్మాదులకైన దెలియనీయను. నీగుట్టింతమాత్రమును బయల్పడదు.

కావున నీగౌరవము, నీభర్తగౌరవము నీవంశగౌరవము నిష్కళంకము పాలుగాకుండ గోరెదవా; నాయిచ్ఛను తీర్చుము. దీనికి నీ సమాధానమే మని యతడడిగెను. అనాథయగు యాయువతికడు జాలికరముగ తన నష్టియవమానము పఱచుట పాడిగాదని మొఱపెట్టెను. పాషాణుడగు నాతనికి జాలియావంతయు గలుగదయ్యెను. కామాతురుడైనవానికి యువతిచేయు ప్రతిక్రియయు కామమును హెచ్చించునేగాని తగ్గింపదు. 'లుక్రీసు' కన్నీళ్ళు విడుచు నప్పుడు, ఆమె సౌందర్యమింకను హెచ్చినట్లాతనికి గన్పట్టె. ఆమె అట్టి గౌప్యమును మానుమని అతనిని ప్రార్థించుచున్నపుడు, టార్క్వినుకు ఆమెపై మోహమింకను బాఱెను.

ఇల్లాలు తననే దుర్మార్గమును మానుమని వేడుకొనుచుండెనో, టార్క్విను ఆదుర్మార్గముచేయుట యందే ఆసక్తుడై యుండెను.

లుక్రీసు తన వేడి కన్నీటిచే ఆతనిని వేడుకొనెను. భగవంతుని పేర వేడుకొనెను. టార్క్వినుకి; తన భర్తనుపుండిన స్నేహధర్మమునైన పాటించవాయని ప్రతిమాలెను' 'సోదరత్వము జూపవా? మానవత్వము జూపవా? నిస్సహాయురాలను; నన్ను కరుణించవా యని ప్రార్థించెను.

రాళ్ళు వర్షముచే అరుగును.
కఠిన హృదయము కన్నీళ్ళచే కరుగునా?

లుక్రీసు తిరిగి యాతనితో 'ఓటార్క్విన్ రాజా' ఆతిథ్యమిచ్చి ఆదరించిన యిల్లాలినా నీవుభంగపఱచుట! అయ్యో! త్రాగుటకు నీరిచ్చినకొలనునా, మడ్డిచేయుట? అన్నము తినిపించినచేతినా ఖండించుట? నీడ నిచ్చిన వృక్షమునా తెగనఱుకుట?

అయ్యో! మానభంగమునకు ప్రతీకారమేమున్నది; ప్రాయశ్చిత్తమేమున్నది. వివాహితను, భర్త గ్రామాంతరుడై యున్నాడు. సోదరుడవని గౌరవించిన నన్ను చెఱుపుట పాడియా అన్నా! నామొఱ వినవా? నాభర్తతోడి మైత్రిని, బంధుత్వమునైన పాటింపవా? ధర్మపరిపాలకుడవగు రాజువే? అట్టినీ రాజరికమునైన పాటించి, అనాథయువతి మానసంరక్షణముచేయవా? నీక్షాత్రగౌరవము నావంటి స్త్రీని అవమానమునుండి కాపాడుటచేగదా గలుగుట. నీ రాజరికమునకు గీర్తి దుష్టశిక్షణ శిష్టరక్షణముచేత, గదా గలుగుట? ధర్మాత్మా! ధర్మమును పరిపాలించవా?

యని వెక్కివెక్కి యేడ్చుచు ఆతనిచేతులనుండి తప్పించుకొనుటకై ప్రయత్నించ నాసీమడు——

'ఓయువతీ! నీనీతులు చాలించుము. నాయాజ్ఞ జవదాటుటకు వలనుపడదు.' అనుటయు నంత లుక్రీసు—' ఓరీఘాతకుడా, పాపీ, హంతకుడా; నీభార్యకు నాయట్టియవస్థగల్గిన నీకెట్లుండునురా? ఓరి రాజాధమా! అన బోవ నాదుర్మార్గుడు శోకభ్రాంక్కనభ్రాంతవలె మండిపడుచు—

టార్క్విను—' ఛీ! నీసంభాషణగట్టుము. నీవు నాపిడికిటజిక్కితివనుచు? నాయబలను బలముగమంచముపై నదిమిపట్టుకొని నేను ఓ భగవంతుడా యని యామెనోటాఱ మొఱలిడుటకైన వీలుకలుగనీయక ఆమె జేబురుమాలుతో నామెపెదవులను మూసివైచెను.

గొఱ్ఱపిల్ల తోడేలుచేతులో పడినది.

టార్క్విన్ పాపాత్ముడు తన పశుబలముచే నావనితారత్నము యొక్క మానధన మపహరించెను. హా! ఇకేమున్నది. లుక్రీసుకు ప్రాణముకంటె ప్రియతరమైన మానమును చెడినది. నిమిషసుఖముచే నాటార్క్విను' దుష్టుడు యుగయుగములు వరకు నరకమును పొందగలడు. ఆమె పాతివ్రత్యమును భంగపరచినాడు. ధనముపోయిన తిరిగి సంపాదింపవచ్చును' మానము చెడినచో కూడిరాదు గదా హా! లుక్రీసు హా! లుక్రీసు!

కాంతిహీనమైన కళ్ళతో చిరకాలరోగముచే బాధపడిన, దీర్ఘరోగివలెనా పాపియగు టార్క్విను, ఆమె మంచమువదలి తప్పుటడుగులు వేయుచు పైకివచ్చెను. తాను చేసిన ఘోరపాపమునకు యెట్టిప్రాయశ్చిత్త మనుభవించవలెనో తలచుకొనుచుండెను. ఇహమున నవమానముచేతను, పరమున దారుణనరకముచేతను తాను బాధపడవలసియుండు నని యెఱిగెను.

ఇక 'లుక్రీసు' ఆమె పరితాపము వర్ణనాతీతము. ఆమెజీవితము నరకతుల్యమైపోయినది. హేయమైనది. వదలని మచ్చదాపురించినది

'టార్కిను' నీచపురుకక్కువలె ఆమె గదివిడిచెను. లుక్రీసుగాయ పడినలేడి పిల్లవలెవిలవిలతన్నుకొనుచు గుండెలుబాదుకొనెను. వాడు తనదౌష్ట్యమునకు తనకు తానేనిందించుకొనును. ఆమె తన గోళ్ళతో శరీరమును చీల్చుకొనను. వాడు ఎప్పుడు తెల్లవారునా యెప్పుడు పాఱిపోవుదునా యని జూచుచుండెను. ఆమె ఇకెప్పటికిని తెల్లవారక, నిత్యమును అంధకారమై యుండవలెనని కోరును. సూర్యుని ఉద్దేశించుచు ఆమె 'ఓసూర్యభగవానుడా నీమొగము నేనెట్లు చూడగల్గుదును. నాజీవితము, అగమ్యగోచరమై అంధకారబంధురమైనది. అక్కో నీవును ఈపాడు ప్రపంచమును ముంజీకటిలో ముంచి, యెన్నడును వుదయింపకుండవా? అయ్యో మోసము చేయువారు చెనటులు తమ మోసములను కప్పిపుచ్చుకొను శక్తిగలిగి యుందురు కదా? నా కట్టిశక్తులేమియు లేవే? నిరపరాధినగు నాకీయవస్థ యెట్లు తప్పును? హా దైవమా? నాకేదిగతి? ఓ నేత్రములారా మీకు గ్రుడ్డితన మేల రాదు? ఓ హృదయమా! నీవు వెంటనే యేలపగలకూడదు?' అనుచు నెత్తిమొత్తుకొనును. గుండెలు బాదుకొనును. నిట్టూర్పులువిడుచును. తలవాల్చుకొనును. తలను గోడకు కొట్టుకొనుచు, ఏడ్చును. తనకిట్టి విపత్తు తటస్థించుటకు 'రాత్రి' యను సమయమొక హేతువని చెప్పి యారాత్రిని యీవిధముగ దూషించును 'ఓకటికి రాత్రీ, నీవెట్టి తుచ్ఛురాలవు? నరకమునకు ప్రతిబింబమవు. నీకుసిగ్గునెగ్గులేవు. హత్యలను పురిగొల్పుదువు. అపరాధములు చేయింతువు. నిరపరాధుల ననాథలుగ జేతువు. దోపిడులు, జేయింతువు. సంసారులను జారత్వమునకు బాల్పడ జేతువు. నీవు చేయింపలేని పాపకార్యములేదు. అతిపవిత్రమై నిష్కళంకమై భర్తృసేవాపరాయణత్వమందే లగ్నమైన నా జీవితమునకు తలపరాని, భరించరాని, వదుల్చుకొనరాని, హేయమగు కళంకమును తెచ్చిపెట్టితివి. ఆహా! నీశక్తి నావంటి దిక్కుమాలిన

దానిపైనా జూపుట, ఛీ ఛీ నీకెంతసిగ్గులేదు? సామర్థ్య మున్నచో, సూర్యునితో యుద్ధముచేయుము. అతడు పైకి రాకుండగ నడ్డుము. మేఘముల సృష్టించుము. పొగమంచుచే భూవలయమంతయు ముంచి వేయుము. విషవాయువులచే సూర్యకిరణముల హతము జేయుము. లోకమంతటిని, నిరంతరాంధత్వములో జొనుపుము.

ఓ ప్రపంచమా! ఇట్టి యవస్థపడుట నావంటి అమాయికకేనా? అయ్యో నేనేమిపాపము జేసితిని? నన్నోదార్చుటకునీవుదక్క వేతెవ్వరు? నాకు నేనై యేడ్చి, నాకు నేనై మూల్గి, యెట్టిసంకటముపడుట తటస్థించినది.

హా! నా బ్రతుకు కాల్పనా? ఓ 'లుక్రీసూ' నీవంటి పాపాత్మురాలెంతైనగలదా? నీతుచ్ఛజీవితము నాబాలగోపాలము హేయముగా జూడ నయ్యెగా? తరతరముల వరకు నీకీ యపకీర్తి పోవదుగదా! అయ్యో!

పిశాచియగు టార్క్వినుచే నేనవమానము పొందితిని. నావల్ల నానాథు డపకీర్తి నొందుటయ్యెను. నాజన్మ మెంత హేయమైనది.'

అని తన్ను తాను నిందించుకొని వెండియు తన నాథునిగూర్చి తలంచి 'హా నాథా! నియ్యర్ధాంగినగు నాకెట్టిగతి పట్టినదో యెఱుగవు గదా? బహు పవిత్రమగు మన దాంపత్యమున కెట్టి కాలుచిచ్చు పెట్టబడినది. అయ్యో నీకును, టార్క్వినుకును, ఉన్న స్నేహముచేతనే గదా, నేనాతని కాతిథ్యమిచ్చినది. నీ కుశలమును దెల్పుటచేగదా నేనతనిని గౌరవించినది. నీయింటగుడిచి నీయింతికి దురంతదుఃఖమును గూర్చిన పాపాత్ముడయ్యెనుగా ఆ టార్క్విను.

హా ప్రపంచమా! యెచ్చట సుగుణములను పెట్టితివో అచ్చట నే దురవస్థను గూర్చుదువుగదా!

కోమలములగు కుసుమములలోనే, చీడపురుగును జొన్పుదువు.

మొగిలిపొదలోనే పాములను చేకూర్చుదువు.
నిర్మలసరస్సునందే బోదురుకప్పల నిల్వజేతువు.
నిండుచందురుని బింబమునకే మచ్చగల్పింతువు.

ప్రశాంతమగు వసంతకాలముననే అశాంతియుతమగు గాలుల పుట్టింతువు.

సుందరలతలప్రక్కనే యేహ్యమగు నాచును సృజింతువు.

ఓహో: ఇవిగూ నీచేష్టలు!' అనుచు కొంతసేపు భగవంతుని వింతచర్యలను విమర్శించి యూపిదప' టార్క్వినుకు లభించిన అవకాశమును నిందించుచు, ఏమానవుఁ జేపనిచేయుటకైనను, 'తరుణమే' కారణమనియెంచి,

'ఓతరుణమా! నీవెంతెంతపనులు చేయించుటకైన చాలిన దానవు. సత్యసంధుడు తరుణము దొరికినచో అసత్యవాదుడగుటకు వెను దీయడు. అతి మైత్రిగల స్నేహితుడు అవకాశము వెంబడించినచో విరోధి యగును. తేనెలొలుకు పలుకులుగలవాడు సమయము దొరికినప్పుడు ప్రత్యక్షముగా నిందలుపలుకును. యీ నీచుడగు టార్క్వినుకీయవకాశము గల్గుటచేగదా నాకీ సంక్షోభము దప్పపెట్టను.

ఓ అవకాశమా—ఓ తరుణమా! నీవు సన్మార్గులను దుర్మార్గులుగ మార్చుటకు పురిగొల్పుదువుగాని; పేదవారిని భాగ్యవంతులుగ జేయుటకుగాని, అనాధలను స్వతంత్రులను జేయుటకుగాని రోగులను ఆరోగ్యవంతులుగ జేయుటకుగాని సహాయపడవుగదా? ఏకపత్నీవ్రతుడు పరస్త్రీలోలత్వముకు బాల్పడుటకు తరుణముపకరించుగాని; స్త్రీలోలుడు ఏకపత్నీవ్రతుడగుటకు తరుణముపకరించదుకదా.

అని యిట్లు విలపించి తిరిగి టార్క్వినును తలంచి—కాలమునుద్దేశించి,

'ఓకాలమా—నీవాద్యంతరహితములు లేనిదానవు. నీవు చేయ లేనిపని లేదు. రాజ్యముల నెడారులుగ జేసి, దిబ్బలను పట్టణముల జేతువు. అణువులను మేరువుగ జేతువు. పసివారిని తండ్రితాతలుగ జేతువు. నీశక్తి వర్ణనాతీతము. అట్టి ఓకాలమా— ఈమానవాధము డగు టాగ్కినును, కాకివలె చిరకాలము బ్రతుకనిమ్ము. మానవుడూ హింపలేని కఠినమగు యమబాధల నీజీవితములోనే యాత డనుభ వించు నట్లు చేయుము. ప్రచండపిశాచము లాతని నెప్పుడును భయ పెట్టునట్లు చేయుము. వాని కొక్కనిమిషమేని విశ్రాంతిలేకుండ దీర్ఘ వ్యాధిని గూర్చుము. నిరంతరమును వాడవమానమునే పొందునట్లు జేయుము. ఆబాలగోపాలమును వానిని పెనుభూతమువలె యెంచ నిమ్ము. ఓకాలమా వానిని బ్రతుకనిమ్ము. పెక్కుసంవత్సరములు బ్రతికి లెక్కలేనిబాధలు అత డనుభవించనిమ్ము. వాడు తన జుట్టు లాగుకొని, నెత్తిమొత్తుకొని, గుండెలుబాదుకొని, ఎలుగెత్తి యేడ్చి; నిట్టూర్పు విడిచి, ఓదార్చువారులేక; దీర్ఘరోగియై, చావలేక, బ్రతుక లేక, సొమ్మసిల్లి, లేచి, మూర్ఛిల్లి, తెలివిగొని, యీనాటి నాయుసురు నిండుగ అనుభవించునంతవఱకు బ్రదుకనిమ్ము.

ఆతని స్నేహితులెల్లరు నాతనికి పరమవిరోధులౌగాక!

ఆతని బంధువులెల్లరు నతనిని గేలిసేయుదురుగాక.

వానినీడజూచి వాడే భయపడుగాక.'

అని యింకను తననుగూర్చి తాను దుఃఖించుచు,

'అయ్యో—దైవమా! యీనా యేడ్పువలన నేమిలాభము? 'రాత్రి' ని తిట్టితిని; 'తరుణము' ను తిట్టితిని; 'కాలము'ను తిట్టితిని. దీనివలన నేమి ప్రయోజనమున్నది. నా మొఱవినువారెవ్వరు? ఈ నా అపకీర్తిని బాపుకొనుటెట్లు? ఎవరిని నిందించిన నేమిగల్గును?

ఓ లుక్రీసూ—నీకు గన్పడుచున్నది. ఒక పేదారి. ఏరక్తము వలన నీవింకను బ్రతికి యేడ్వగలుగుచుంటివో, అట్టి నీరక్తమును వెడజల్లుట, అదియే నీకర్తవ్యము. ఈమచ్చ, ఈకళంకము, బాపు కొనుటకంతకంటె వేఱుమార్గము లేదు.'

అని తన చేతులనుద్దేశించి, 'ఓహస్తములారా! మీ జన్మకాల్ప నా! మీ దేవిమానమును గాపాడజాలరైరి. అట్టి మీరామెరక్తమును జిమ్ముటకే పనికివత్తురు. కావున సిద్ధముగండు.'

అని 'లుక్రీసు' తన యిల్లు నాల్గుమూలలను పరికించి ఏదైన కత్తిగాని మఱియే యితరాయుధమైనకలదేమో యని వెదకెను. కాని యేదియు గానుపించదయ్యెను.

ఇంతలో నామెకు మనస్సుమారి ఆత్మహత్యావిషయమై జాగు చేయ నిశ్చయించెను. తనహైన్యమును ప్రపంచము తెలిసికొనకుండు టకై, తెల్లవారినను, తన గదివి తాను వదలకుండనందులోనే యుండ నిశ్చయించుకొనెను.

తన నాథుడు వచ్చునంతవఱకును బలవన్మరణము పొందదలచు కొనలేదు.

తెల తెల వాఱజొచ్చెను. తూర్పుదిశ తెల్లనై క్రమముగ కుంకుమచ్ఛాయనుపొందజొచ్చెను. చల్లని పిల్లవాయువులు ప్రాతః కాలమున విసురుచుండెను. పక్షులు కిలకిలారావములు సూర్యభగ వానునికి స్వాగత మిచ్చుచుండెను.

విచారము—విచారము చేతనే శాంతించునుగాని సౌఖ్యముచే శాంతించదు. నలుగురితో చావు పెండ్లితో సమానము. ఒకవ్యక్తి దుఃఖించునప్పుడు, ఆదుఃఖము వేఱొకవ్యక్తికూడ అనుభవించు చున్నచో వారిద్దరిదుఃఖమును కుదుటపడును. అట్లుగాక, దుఃఖించు

వ్యక్తిముందు వేఱొకవ్యక్తి సకలసౌఖ్యములు పొందుచో, దుఃఖించు వాని దుఃఖము మఱింత హెచ్చుట సహజము.

అట్లు 'లుక్రీసు' దుఃఖము పంచుకొనుట కెవ్వరును లేరు. మీదు మిక్కిలి ఉదయకాలపుపక్షులు 'లుక్రీసు' ను జూచి పరిహసించునట్లు, కిలకిలారావములు చెలరేగ హాయిగ నాడుచుండుటచే, లుక్రీసు పరివేదన మఱియు హెచ్చెను. ఆమె వాటితో 'ఓపిట్టలారా, కాలినపుండుపై బల్లెపుపోటునట్లు, నన్నుమీరు పరిహసించుట నా దుస్థితిజూచి సానుభూతి జూపుటమాని నన్ను వెక్కిరింతురా; గేలి సేతురా? మీకు న్యాయమేనా? నేనేమిపాపము జేసితిని? అయ్యో!' అని యాయువిదకడుంగడు విలపించెను.

క్రమముగ సూర్యోదయమునయ్యెను. ఆకిరణములు కిటికీలో నుండి ఆమె ముఖముపై బడజొచ్చెను. అంత లుక్రీసు 'ఓకిరణములారా! నన్ను జూచి నవ్వుచుంటిరా, అయ్యో, నాకొనా, మీ పరిహాసము? నాబ్రతు కెంత నీచదశకువచ్చినది ఎంత హాస్యాస్పదముగ మారినది.' అని యనేకసారులు నెత్తియు నోరును మొత్తుకొనెను. తన యవమానమును గప్పిపుచ్చుట అసంభవము. అధర్మము. అవినీతికరము. కావున తన నాథునికి వెంటనే వర్తమాన మంపవలసి యున్నది.

తెల్లవారి సూర్యోదయమగుసరికి, ఆమె సేవకురాలు వచ్చెను. ఆమెనుజూచి లుక్రీసు వెక్కివెక్కి యేడ్చుచు ఆమె మొగమేనియు జూడలేకపోయెను. దాసి నిర్ఘాంతపోయెను. 'అమ్మా! ఏమట్లు విచారించుచుంటిరి? అయ్యో అదేమి. మిమ్ములనుజూచిన నాకు దుఃఖము వచ్చుచుండెనే; అమ్మా కారణముజెప్పరా' అని యడుగ, లుక్రీసు కొంత శమించి 'జెస్సీ' (దాసిపేరు) నన్ను కారణమడుగకుము. నన్ను పూర్తిగ జూడకుము నన్ను మన్నించకుము. నన్నేప్రశ్నయువేయక,

నేనడిగిన దానికి జవాబిమ్ము, నే చెప్పినపనిని జేయుము' అని తిరిగి కన్నుల వెంబడి బొటబొట నీరుగార్చుచు, 'జెస్సీ' అని పిలిచి, నీవు పోయి మీఅయ్యగారి సేవకుని ఒకనిని తీసుకొనిరమ్ము. అతడు వెంటనే 'అర్డియా?' కు (అనగా యుద్ధము జరుగుచున్నపట్టణము) బోవలసి యున్నది నేను మీఅయ్యగారి కొకఉత్తరము వ్రాసి యిచ్చెదను. కారణముడుగక, కాలయాపన చేయక యిక్కడ నున్నట్లు వెంటనే రావలెను.' అని చెప్ప జెస్సీ మాఱుమాటాడక వెంటనే సేవకుని కొరకై బోయెను.

లుక్రీసు తనలో 'నీజన్మయిక వృధ. బ్రతికితిని—జీవచ్ఛవమగుదును. గౌరవహీనమైన జీవితముకంటె గౌరవార్హమగు చావే సుఖకరమును కీర్తివంతమునై యున్నది. నీనాధునికి వెంటనే ఒకవిన్న వ్రాసి పెట్టెదను. నాఅనంతరమాతడది జూచుకొనును.

'నాప్రాణేశ్వరా—నేను నీకిచ్చినది నాప్రేమ అట్టి నీప్రేయసి నగు నాకీయవమానము భరింపరానిదై నేను పరమున కేగుచుంటిని. నీయవమానమునకు గారణుడగు టార్క్విను పై నీపగయంతయు దీర్చుకొనుమని నాప్రార్థన అప్పటికిగాని నాయాత్మకు శాంతిగలుగదు, నేనిక నీకు పనికిరాని దానగుటయే నాయీబలవన్మరణమునకు కారణము. ఇదియే నాతుదినమస్కారము.'

అని ఒకకాగితముపై వ్రాసి మడతపెట్టి అదిదాచెను.

'ఓదైవమా—యీభగ్నశరీము నీపాలు ఓనాధా! నాప్రేమ నీపాలు. ఓఖడ్గమా నాగౌరవమునీపాలు. ఓటార్క్వినూ, నాహైన్యము నాయుసురు నాక్షోభమూనీపాలు. ఓలుక్రీసూ—మరణము నీపాలు.

ఓప్రాణనాయకా, కొల్లెటిన్ప్రభూ—నాశరీరమునకు హేయమగు మాలిన్యము దాపురించినది. ఆమలినమును కడుగుటకు సప్త సముద్రములేనియు జాలవు కుంభీపాతకముగ శతాబ్దములకొలది ఒకే

రీతిని కురిసిన వర్షధారలైన జాలదు. నీమాలిన్యము బోగొట్టుటకు నారక్తమే కావలెను. కావున, నేనీదుర్మరణమునకు గడంగవలసి వచ్చినది.' అని తనలోతాను పదేపదిగ దుఃఖించి మెట్టకేలకు తిరిగి కుదుటపడి, ఉషఃకాలమున మల్లెమొగ్గనుండి జారెడిమంచు బిందువులని భ్రమింపజేయు తన నేత్రబిందువులదుడుచుకొని—నాధునికీక్రింది రీతిని వుత్తరము వ్రాసెను.

'నాథా—నీయర్ధాంగినని చెప్పుటకనర్హురాలనగు నేను నీకు నమస్కరించి వ్రాయునది—భగవంతుడు నీకుసదా క్షేమము కలుగ జేయుగాక, నాయందు నీవు జూపినప్రేమయే కారణముగ, నీకెట్టి పనులున్నను వెంటనేబయలుదేరి రా ప్రార్థించుచుంటిని. మనసంసార మునకు భరింపరాని ఆపద తటస్థించినది. నాకోభమూచి గ్రహించవలెనేగాని వ్రాయనలవిగాదు. తక్షణమురాగలరని నమ్ము—

మీపాదసేవకురాలు

లుక్రీసు'

అని వ్రాసి ఆయుత్తరమును మడిచి సేవకుని రాకకై యెదురు చూచుచుండెను. భర్తయగు కొల్లెటినుకాయుత్తరములోని నిజవృత్తాంతము తెలియకున్నను, లుక్రీసు చాల దురవస్థలోనున్నదని మాత్రము గ్రహించుటకు సందియము లేదు.

ఉత్తరములో నంతకంటెనెక్కువ వ్రాయుటకు లుక్రీసు కిష్టము లేకపోయెను. తన దుఃఖమునంతయు గూడబెట్టి, తననాధుని సమక్షముననే వెళ్ళబుచ్చుటకు సమకట్టినదై, వుత్తరమును, మాత్రము బహుక్లుప్తముగా వ్రాసినది.

కొంతసేపటిలో సేవకుడు వచ్చెను. లుక్రీసాయుత్తరము నాతని కిచ్చి, వాయువేగ మనోవేగములతో జని . . ది నీస్వామి కీయుము.

మాటుప్రశ్నవలదు. పొమ్ము, అనిచెప్ప నాతనును, చిత్తమని బయలుదేరి పోయెను.

లుక్రీసు గడియయుగముగ వలెగడుపు చుండెను. ఎంతసేపేడ్చినను, మాన ప్రాణములు తిరిగిరావు గదా! యని తనలో తానే యోదార్చుకొనుచు, 'నాథు డెప్పుడు వచ్చునా!' తన జీవయాత్ర యెప్పుడు ముగింతునాయని తహతహపడుచుండెను.

'ఆర్డియా'లో కొల్లెటినునకు ఉత్తరమందెను. ఆతడు భయభ్రాంతుడై యాసేవకుని; తనమామగారగు బ్రూటను, గ్రామమునకు బంపి యాతని గూడ వెంటనే గొనితెమ్మని పురమించెను. పిదపతాను తన, తోడిసైనికోద్యోగులతో గూడ ఖడ్గహస్తుడై బయలువెడలి అనతికాలములో స్వల్పగృహమును జేరుకొనెను.

లుక్రీసు, నేలగూలిన కదళీవృక్షమువలె బరుండెను, నల్లని చీర ధరించి ముసుగువైచుకొనెను. మగడువచ్చెనని తెలియగనే నెమ్మదిగలేచి యాతని చూచుచు, నశ్రువులురాల్చెను. నోటనొక్క టేనియు మాటరాకుండెను. భార్యాభర్తలు కొంతసేపటివరకును శిలాప్రతిమలవలె నొకరిమొగము నొకరు జూచుకొనుచు భయసంభ్రమములలో నుండిరి.

కొంతసేపైనపిదప—కొల్లెటిను భార్యతో 'నీవర్తమానమునకు గారణమేమి? నాకేమియుతోచకున్నది. వేగముగనుడువవా?'యని యడుగ నామె మగనిపాదములపై పడబోయి, తిరిగి జంకినదై, ఒకింత దూరమున నుండియే లుక్రీసు ప్రాణేశ్వరా! ఏయింతి పవిత్రప్రేమచే నీకు దాంపత్యమేర్పడినదో-ఏయింతిసర్వస్వమని నీవుతలంచెడివాడవో అట్టి నీ లుక్రీసు మానధనము. ఒక దుష్టుని దుర్మార్గముచే కొల్లగొట్ట బడినది. నీవును యీనీసహోద్యోగులును నాయీ పరాభవమున కా దుష్టుని సాధించి పగదీర్చుకొనవలెనని నాప్రార్థన'అని నుడువ 'కొల్లె

టినరక్తమంతయు మఱిగి ముఖమునకు బ్రమ్మనాతని కన్నులెఱ్ఱనై చూడ భయంకరముగ నుండెను. అతడు ఆమెను ఆదుష్టుడెవ్వడని యడుగగా—నామె! నాథా నాకు నోరు రాదు—వానిపేరు నన్ను స్మరింపనీయకుము. అంతయు నీవిల్లులోనున్నది. యికమఱి శలవింక. మీకిదే నాతుదినమస్కారము! అని తన పమిటలోదాచిన బాకును పైకి లాగి గుండెలలో పొడుచుకొని, 'హా'యనుచు నేలవ్రాలెను.

ఇంతలో నామెతండ్రియగు బ్రూటసువచ్చి, హా! నాతల్లి! నా బిడ్డా—యనుచు నతడామె శరీరముపైబడి యెలుగెత్తియేడ్వ, కొల్లెటినుకూడ నల్లో 'హా ప్రేయసీ'యని పెద్దపెట్టున నేడ్చి తనఖడ్గముతో పొడుచుకొనబోయెను. కాని ప్రక్కనున్న యుద్యోగు లాతనిని బట్టుకొని కొల్లెటినూ—ఆడదానివలె నాత్మహత్య జేసుకొనుటమంచిదో, లేక పౌరుషమున్నవాడవై యామదాంధునిపై పగదీర్చుకొని నీ యర్ధాంగి యాత్మకు శాంతిగొల్పుట మంచిదో యూహించుకొనుము' అని చెప్ప కొల్లెటిను ఖడ్గమును ఒఱలోగుచ్చి లుక్రీసువిల్లును జదువుకొని యాదుష్టుడు 'టార్క్విను' అసి తెలుసుకొనెను.

పిదప 'లుక్రీసు' కళేబరమును, దేశాచారము ప్రకారము వీధులలో నూరేగించి ఆమె మానప్రాణములు కొల్లగొట్టిన పాపాత్ముని కెట్టి శిక్ష విధించవలయునను విషయతీర్మానమునకై పెద్దసభ జరిపిరి. అందు, అందరు నేకగ్రీవముగ టార్క్వినును, వెదకి పట్టుకొని, ప్రతియొక్కరును యీటెలతో బొడిచి చంపవలయునని నిశ్చయించుకొనిరి. టార్క్విను దుర్మార్గుని దుర్మార్గత తెలిసినపిదప ఆతని సైనికులే ఆతనిపై తిరుగబడి పట్టితెచ్చి సభవారి అంగీకారము ప్రకారమాతనిని బంధించి, యీటెలతో బొడిచి చంపిరి.

# ఇజబెల్ కస్ట్రొ

ఒకప్పుడు 'వియ్యన్నా' అను పట్టణమును ఒకరాజు పాలించుచుండెను అతడు చాలమంచివాడు. ప్రజలను బిడ్డలవలె పాలించుచుండెను. దైవభక్తుడై న్యాయమును, ధర్మమును న్యాయపాదములను నడుపుచుండెను. వయస్సు 30 సంవత్సరములుండెను. ఇప్పటికింకను వివాహము కాలేదు.

ఇతనికి ఒకమంత్రి వుండెను. ఇతడు చాల తెలివితేటలు గలిగి రాజునకిష్టుడై ప్రవర్తింపుచుండెను. రాజును కితనియెడల మిక్కిలి అభిమానముగలిగి ప్రతివిషయమునందును మంత్రియొక్క సలహాను తీసుకొనుచుండెను.

రాజొకనాడు మంత్రికై కబురుపంపగా, మంత్రివచ్చి నమస్కరించి నిలబడెను. అంతరాజు మంత్రివైపుతిరిగి నాప్రియమైన మంత్రీ, నిన్ను నేనొక రాచకార్యముకొఱకై రప్పించితిని. నాతండ్రియొద్దను, నాయొద్దను, చాల సంవత్సరములనుండి పనిచేయుచు మాయభిమానమును సంపాదించితివి. నీసుగుణములను నేను యెక్కువగా కొనియాడినచో, వట్టి పొగడ్తలనుకొనెదవు. కావున యెక్కువగా వాటినిగూర్చి ప్రస్తావనచేయను. భగవంతుడు మనయెడల నెట్టి ప్రేమను జూపునో అట్టిప్రేమనే మనముకూడ మన ప్రజలకు జూపవలెనని, నీవు బాగుగ గుర్తెఱిగితివి.

సరి, ఇప్పుడు ముఖ్యవిషయమును చెప్పెద వినుము. నేను కొంతకాలము దేశాటనకై బోవుచుంటిని. నేను వచ్చువఱకును ఈనా రాజ్యమును చాల జాగరూకతతో పరిపాలించుటకు నీకిప్పుడే నాయధికారమును వ్రాసి యిచ్చుచుంటిని. నాచట్టములను అమలునందుంచు

నువుగాక! ప్రజలను కన్నబిడ్డలవలె జూచెదవుగాక. నాసంచారమును గూర్చి నీకు అప్పుడప్పుడు తెలియబఱచుచుందునులెమ్ము' అని చెప్పి రాజు తన యధికారపత్రమును మంత్రికిచ్చెను. మంత్రి రాజాజ్ఞకు మిక్కిలి సంతసించి; తన కృతజ్ఞతాపూర్వకవందనముల నర్పించెను. రాజు మంత్రికి శెలవొసగి సభ చాలించెను.

రాజ్యములోని ప్రజలందఱును, తమరాజు దేశయాత్రకు పోయెననియు, మంత్రిగారు ఆయన వచ్చువఱకును ప్రభుత్వము నలి పెదరనియు తెలుసుకొనిరి.

ఆ రాజ్యములో ఒకశాసనముండెను. అదేదన పెండ్లికాని యువతితో నెవ్వరైన సంచరించినచో దానికి శిక్ష ఉరి ఇట్టిశిక్షకు ఒకచిన్న యువకుడు నేఱస్థుడయ్యెను. మంత్రి రాజ్యమునకు వచ్చిన మొదటినెలలోనే యీకేసు ఆయనయెదుటకు వచ్చెను. అదెట్టిదనగా 'వియ్యన్నా' పట్టణములో 'క్లాడియో' అను ఒక యువకుడుండెను. ఇతడు గౌరవమైన కుటుంబములో పుట్టినవాఁడు. ఇతనికి అవివాహిత యగునొక యువతితో స్నేహము లభించెను. అది క్రమముగ గాఢమై ప్రేమలోనికి దిగెను. వారిద్దరును ఒకరి నొకరు పెండ్లిచేసుకొన నుద్యమించిరి. కాని పెండ్లియగుటకు ఆయువతి తలిదండ్రులు అంగీకరించక పోవుటచే, శాస్త్రోక్తముగా బహిరంగముగా, నది జరుగకపోయెను. ఈలోపున వారిద్దరు రహస్యముగా ప్రవర్తించుచుండుటయు, దానికి ఫలితముగ నాయువతె గర్భముదాల్చి యొక మగశిశువును గనెను.

ఈవార్త తెలియుటతోనే ఆమె తలిదండ్రులు క్లాడియోపై కేసు పెట్టిరి. రాజ్యముచేయుచున్న మంత్రిగారు తాను పరిపాలించుటకువచ్చిన మొదటినెలలోనే యీకేసును విచారణచేసిరి. క్లాడియో అబద్ధమేమియు చెప్పడయ్యెను. ఆయువతెకూడా నిజము చెప్పెను. ఆమె నిజముచెప్పుచు మంత్రితో ఓదేవా! నాకుకలిగిన శిశువుకు

క్లాడిమోతండ్రి క్లాడియోను నేను హృదయపూర్వకముగ ప్రేమించితిని. మేము వివాహముచేసుకొనియే యుండెడివారము. కాని దానికి మాతలిదండ్రులు లక్ష్యపెట్టుట చేనది వీలు లేక పోయినది. ఐనను దేవరవారు మాయందుదయయుంచి మమ్ములను భార్యాభర్తలుగా అంగీకరించి, క్లాడియోకు యేవిధమైన శిక్షయు వేయక యీకేసును కొట్టివేయవలసినదిగ ప్రార్థించుచుంటిని అని మిక్కిలి దీనముగ వేడుకొనెను కాని మంత్రి తనకు గలిగిన పదవికీ గర్వోన్మత్తుడై గుడ్డిదర్బారుగ నాయువతీ యువకుల ప్రేమనైన పాటింపక, యధాశాస్త్రముగ వర్తించవలెనని చెప్పి యా గొల్లకన్యతో 'ఓ యువతీ! నీవును 'క్లాడియోయును' మిక్కిలిగ నొకరినొకరు ప్రేమించుకొన్నను మీ ప్రవర్తన చట్టమునకు విరుద్ధముగ నున్నది. నీవు పెండ్లియవని యువతెవు. అట్టి నీతో క్లాడియో రమించెను. నీకతడు 'మొగుడుకాని మొగుడు' దానికి ఋజువు నీబిడ్డయే. కావునకన్యవగు నీతో చరించినందున క్లాడియోకు ఉరిశిక్ష తప్పదు' అని తీర్పుచెప్పెను. ఆగొల్లది వలవల యేడ్చుచున్నను, నావలకు త్రోసివేయబడెను. 'క్లాడియో'ను రాజభటులు బంధించిరి. వారము రోజులలో 'క్లాడియో' ఉరితీయబడనై యుండెను.

'క్లాడియోకు' మన కథానాయకురాలగు 'ఇజబెల్'అను నొక చెల్లెలుండెను. ఆమె యీకేసు వచ్చునప్పటికి గ్రామములో లేక పోయెను. ఇజబెల్ మిక్కిలి రూపవతి. నిండుజవ్వని. కోమలములగు మాటలుగలది. చిన్ననాటనుండియు వేదాంతగ్రంథముల ననేకములు చదివెను. ఐహికసుఖములను గడ్డిపోచలవలె గణించు బ్రహ్మచారిణి.

తనయన్న దురవస్థనుగూర్చి మామెకెఱింగించుటకు క్లాడియో స్నేహితు డొకడు ఆమెయొద్దకువచ్చి 'ఇజబెల్' అనిపలుకరించ వారి కిద్దఱికి యీక్రింది సంభాషణ జరిగెను.

స్నే—ఇజబెల్-నేను మీయన్నయగు క్లాడియోవద్దనుండి వచ్చితిని.

ఇజ—అయ్యో-అతడుకుశలమా?

స్నే—అమ్మా అతడిప్పటికి కుశలమేగాని ఖైదులో నుంచబడెను.

ఇజ—అయ్యో-ఇదేమి? అతడేమి నేరము జేసెను?

స్నే—ఒక కన్యతో భోగించి శిశువును గనెను. దానికై మన రాజ్యముచేయు రాజుగారు ఉరిశిక్ష వేసిరి.

ఇజబెల్ భయసంభ్రమములతో కూడినదయ్యెను. లోలోన నే దానిని అణచుకొని, అమ్మా దానికి ఉరియే కాని వేరుశిక్ష లేదా-అయ్యో! నా అన్న కెట్టిగతిపట్టినది

స్నే—ఇజబెల్ నీవు విచారించినచో లాభము లేదు. నీయన్న నెట్లయిన నీశిక్షనుండి తప్పించ ప్రయత్నింపవలెను.

ఇజ—ఆహా! నేనేమిచేయగలను. రాజాజ్ఞ మనముద్దచెప్పిన లాభమేమున్నది?

స్నే—నీశక్తి నీవెటిగితివేని, నిముషములో మంత్రిమనస్సు కరిగింపగలవు. ఆలస్యముచేయక సత్వరము ప్రయాణముగమ్ము. అని వెడలిపోయెను.

ఇజవెల్ వెంటనే బంధువులయొద్ద శలవుదీసికొని వియన్నా పట్టణమునకు బయలుదేరెను.

క్లాడియోకు వేసిన శిక్షను తగ్గించవలసినదని 'మంత్రిగారిని' ఇతరజడ్జీలు చాల ప్రతిమాలిరి. చిన్నవయస్సుచే 'క్లాడియో' పొరపాటు పడెననియు, క్లాడియోవంటిచేష్టలు అనేకులు ఆవయస్సున చేసెదరనియు, అంతమాత్రముచే 'ఉరి' కి, శాంతునుచేయుట న్యాయముకాదనియు, ప్రథమ తప్పిదము కావున శిక్షతగ్గించవలెననియు

వారు చెప్పిరి. కాని మంత్రిగారు వారి మాటలు చెవినిబెట్టడయ్యెను. చట్టవిరుద్ధముగ ప్రవర్తించినవాడగుటచే 'క్లాడియో' చావవలెనని కచ్చితముగా చెప్పెను. జడ్జీలు యేమియు ననలేక, 'చిత్తము' అన వలసి వచ్చెను.

ఇంతలో మంత్రినిచూచుటకు 'ఇజబెల్' ఒకసేవకుని లోనికి బంపెను. సేవకుడు మంత్రితో అయ్యా! తమదర్శనమునకై ఒక యువతి వచ్చినది. శలవైనచో లోనికిరావింతును' అనెను. అంత మంత్రి 'ఎవరురా ఆయువతి' యనెను.

సేవ—'స్వామీ! మీరు ఉరిశిక్ష విధించిన 'క్లాడియో' చెల్లెలు 'ఇజబెల్'

మం—ఏమీ? క్లాడియోకు చెల్లెలొకతె గలదా?

సేవ—చిత్తముప్రభూ! ఆమె మిక్కిలి విద్యావతి. సుగుణవతి. లోపలికిరమ్మని శలవా?' యని అడుగ మంత్రి వెంటనే శలవిచ్చెను. ఇజబెల్ ఒకనిముసములో లోనికి వచ్చినదై మంత్రికి నమస్కరించ వారిద్దరికి యీక్రిందిమాటలు జరిగెను.

మం—అమ్మాయీ! నీవేనా 'క్లాడియో' చెల్లెలవు? మంచిది. నీవిప్పుడు వచ్చినపనియేమి?

ఇజ—ప్రభువువారు నా ప్రార్థనను సావకాశముతో విన వేడు చుంటిని.

మం—మంచిది. అదేదియో చెప్పుము.

ఇజ—దేవా! పాపమునకు వెఱచుదానను పాపాత్మునికి శిక్ష వేయుటలో తప్పులేదనుదానను, ఐనను, అని యేదో చెప్పబోవ,

మం—సరిలెమ్ము. నీవువచ్చినపనేదియోక్లుప్తముగా చెప్పుము.

ఇజ—క్లాడియో నాసోదరుడు అతడు చేసినది పాపమే?

మం —పాపముమాట యిటుండనిమ్ము. అది గొప్పనేఱము.

ఇజ—చిత్రము. పాపయుక్తమైన నేరమే యనుడు. ఆ నేర మున కాంతని కుతీశిక్షవిధించిరి. ఇప్పుడు తమరికి ప్రార్థించున దేమన. అతనికి విధించిన శిక్షను తప్పించి, అతనిని మంచిత్రోవలోనికి త్రిప్పుట కవకాశము దయచేయుంచ వేడుచుంటిని. అతనిని శిక్షించుటకంటె అతడు చేసినతప్పునే శిక్షించుటకు ప్రార్థించుచుంటిని.

మం—ఓహో! తప్పుచేసినవానిని దండించక, తప్పునే శిక్షించ మనెదవా? సెబాసు మంచితీర్పునే చెప్పితివే?

ఇజబెల్ చాలపౌరుషము, అభిమానము కలది. మంత్రి తన నట్లు చులకనగా జూచుటకని పెట్టి యించుక మౌనముతో

ఇజ—ఐన, క్లాడియో చావవలసిన దేనా?

మం—ఔను. అందుకు నేనేమియు సహాయము చేయలేను.

ఇజ—అయ్యా! చేయలేకుండు టేమి అధికారులు; చేయుట కిష్టమేయున్న, చేయలేని దేమున్నది?

మం—చట్టవిరుద్ధమైన నేరమునకు ఇష్టముమాత్ర మెట్లుం డును.

ఇజ—చట్టబద్ధమైన న్యాయమునే చూచుచుంటిరిగాని, దైవ దత్తమైన కరుణనుగూర్చి యాలోచించుటలేదు. మిమ్ములను కోరు చున్నది కరుణ. నాయన్నను కరుణించమని ప్రార్థించుచుంటిని, న్యా యముకంటెను, కరుణ గొప్పది. భగవంతుడే కరుణాస్వరూపుడు. ప్రభువు భగవత్స్వరూపుడు. కావున ఓ ప్రభూ నాయన్నను రక్షింపుము.

మం—వెఱ్ఱిపిల్లా! ఏమిలాభము ? ఇప్పుడు నేను చేయున దేదియు లేదు. మించిపోయినది కలిసిరాదు. చేసినతీర్పు అద్దుచేయ వీలు లేదు. పొమ్ము.

ఇజ—అయ్యా! నాయన్న చేసిన నేరము అస్వాభావికమైనది కాదు. అతని పరిస్థితులలో నెవడైనను అట్లు ప్రమాదముపడువాడే.

దానికై యతనిని మరణము పాలుచేయుట ధర్మముకాదు. తమకు పదవి వచ్చినదికదాయని నేఱస్థునిపై పూర్ణముగ ద్వేషమువహించుట కానిపని. ప్రభువగుటకుముందు ప్రజలపాట్లు తెలుసుకొనవలెను. జడ్జి కాదలచినవాడు ఖైదీకష్టముల నెఱుగవలెను. తమరే నాయన్న స్థితిలోనున్న యెట్టిక్షోభమును పడుదురో ఆలోచించుకొనుడు. నాకు తలిదండ్రులు లేరు. నాయన్ననుకూడ లేకుండునట్లు చేయుట పాపపు పని. నాయందు దయయుంచి నాయన్నను క్షమించుడు.

మం—ఇజబెల్ ఏల నీకీపిచ్చి. నీయన్నను బ్రతికించినచో 'లా'కు వ్యతిరేకముచేయుట యగును. అట్టి నేఱము చేసినచో నా స్నేహితుడైనసరే, నాబంధువైనసరే, వేయేల నాకొడుకైనసరే, నేను మఱణదండన విధించుటకు సందేహించను. నీప్రార్థన కట్టిపెట్టుము. నీయన్నక్లాడియో, రేపే ఉరితీయబడును.

ఇజ—అయ్యో! అయ్యో! రేపేనా? ఓస్వామీ మనము తినెడి కాయగూరలు సైతము లేతవైనచో నఱుకుటకు చేతులురావే. చిన్నపిల్లయైనచో కోడిని గోయుటకు జాలిపడి కొన్నాళ్ళింకను బ్రతుకనిత్తుమే. నాయన్న కప్పుడే నూరేండ్లు నిండ జేసెదవా? మనరాజెన్నడును ఈనేఱమున కిట్టి శిక్ష విధించలేదే! అట్టిశాసనమును మీరు పదవికివచ్చి నెలరోజులైనగాకుండ, లేతవయస్కుడగు నాయన్నను ఉరికంబముల కంపుదురా! యని వెక్కి వెక్కి యేడ్వజొచ్చెను. అంత మంత్రి నవ్వుచు,

మం—ఇజబెల్. ఏమంటివి? మనరాజుగారి టైములో ఈచట్ట మెన్నడును అమలులో పెట్టలేదనియా? ఔను. ఆయన అట్లు అమలులో పెట్టకపోవుటచేతనే నీయన్నవంటి వాళ్ళిట్లు నిర్భయముగా అవినీతిపనులు చేయుచున్నారు. అబలా అమలుపెట్టనంతమాత్రమున శాసనము రద్దుఅగునా? నాప్రభుత్వమున అట్టిఆటలు సాగవు.

ఇజ—దేవా? ఐనను మానవునికి నేరస్థుడైనను తోటిమానవునిపై కొంచెమేని జాలివలదా?

మం—నేరస్థునిపై జాలికలుగుట రాజలక్షణముకాదు.

ఇజ—ఆహా! రాక్షసునివంటి శక్తయేనాకున్న రాక్షసునిక్రౌర్యమునుమాత్రము విసర్జించియుండెడిదాననుగదా! భగవంతుడా? నీప్రేమస్వరూపమును కనుగొనక ప్రభువులెంత దుర్మార్గమునకు గడంగుచున్నారు. నీవు మేఘమువంటి శక్తిగలిగియు పిడుగులను బలవత్తరమగు పెద్దవృక్షములపై వదలుదువుగాని, లేతవటి మొక్కలపై కెన్నడును పోనీయవు. కాని, దుష్టుడగు మానవుడన్ననో, కొంచెము పాటిపదవి వచ్చినమాత్రమున; కన్ను మిన్నుఐగక అమాయకులగు లోకులను బలహీనులను, యెట్టియిక్కట్లపాలైన చేయవెఱువరుగదా!

మం—ఓయువతీ—నీ వేదాంతమునకిదిచోటుగాని, సమయముగాని కాదు. నీయన్న క్లాడియో జేసినది గొప్ప నేఱము.

ఇజ—అయ్యో! పేదవాఱిపాలిబాట్లు గొప్ప నేఱములై, గొప్పవాఱి గొప్పనేఱములు చిన్నపాటిబాట్లగుకాలమిది న్యాయమునకు చోటులేని ప్రపంచమిది. అధర్మము విచ్చలవిడిగ నాట్యమాడెడి రాజ్యమిది.

మం—ఇజబెల్—నీవు నన్ను నిందించిన నేమిలాభము?

ఇజ—ప్రభువులుగావున, మీహృదయముమాఱి నాయన్నను బ్రతికింతురను ఆశయేనన్ను యీరీతిని మాట్లాడించుచున్నది. దూషణమిమ్ములను చేయుటలేదు. మీప్రభుత్వవిధానమును దూషించుచుంటిని. మీరు మీగుండెలపై చేయిడైచుకొని క్లాడియోవంటి స్థితిలో మీరేయున్నచో, మీమనస్సతని నేఱమువంటి నేఱమును చేయుటకు ప్రేరేపించునో, లేదో, ఆలోచించుకొనుడు.

మం—(తనలో) యీ మెమాటలు కడు చోద్యములై ఒప్పుచున్నవి. ఈమెజ్ఞానము ప్రశంసనీయముగ నున్నది. (ప్రకాశముగా) ఇజబెల్ నీవికపోవచ్చును.

ఇజ—అట్లే పోదును. నా ప్రార్థనకేమి జవాబిచ్చెదరో తెలుపుడు.

మం—సరి. నేనాలోచించెదను లెమ్ము. రేపురమ్ము.

ఇజ—ఏసమయమునకు రమ్మనిశలవు?

మం—ఉదయమే మైఱ్ఱము నైననున రే.

ఇజబెల్ తన ప్రార్థనను మంత్రిసావకాశముగావిని, తిరిగి రమ్మని చెప్పుటచే, సంతోషస్వాంతయై, ఆతనియొద్ద శలవుగైకొని యింటికి పోయెను. ఆమె వెళ్ళిన పిదపమంత్రి తనగదిలోనికిపోయి మనస్సులో నిట్లని యాలోచించుకొనెను.

'ఆహా' ఇజబెల్నుచూచిన నిముసమునుండి నాకేదియో పిచ్చి పట్టినట్లున్నది. లేకున్న రేపురమ్మని, నేనామెతో నేలననవలెను? ఆమె సౌందర్యము నన్నెంత మోహాపఱచుచున్నది. నేటివఱకును పఱయువతెను కన్నెత్తి జూడని నాకీభ్రమ నేలపుట్టవలెను? పెట్టనేయును కొందము. స్వచ్ఛజీవనము గలిగి, పవిత్రతగలిగిన యీ యువిదపై నేల కలుగవలెను. పెక్కండ్రు వేశ్యలిచ్చు సౌఖ్యము కంటెను ఒక్క వ్యభిచారిణి యిచ్చుసౌఖ్యము యెక్కువని కాబోలు సంసారిణుల పొందునే, పరపురుషులుకోరుదురు. నావంటిప్రభువులే యిట్టిదుష్కృత్యమునకు బూనుకున్న, సామాన్యులు వెఱుతురా? జడ్జీలు దొంగతనము చేయుచో, దొంగలు చేయుపని న్యాయసమ్మతమే యగును కదా! కానిమ్ము ఇదియెందుకువచ్చినదో వచ్చినది. ఇజబెల్ నెటులయినను వశముచేసుకొన ప్రయత్నించెదను.'

ఇట్లుకృతనిశ్చయుఁడై యాదుర్మార్గుఁడగుమంత్రి రాత్రియంతయు మోహబాధచే, నిద్రరాక, ఇజబెల్ యెప్పుడువచ్చునా యని యువ్విళ్ళూరుచుండెను. చేతులోనున్నది అధికారము. వేసినది ఉరిశిక్ష. ప్రార్థింపుచున్నది, నేఁఅస్థుని చెల్లెలు, ఇక మంత్రి, మంత్రము ఫలింపకుండునా?

మఱునాడు తెల్లవారినది. ఉదయ మెనిమిదిగంటలకు ఇజబెల్ మంత్రిగారి దర్శనమునకువచ్చి నౌకరు లోనికికబురంపించెను. మంత్రి వెంటనే ఆమెను లోనికి గొనితెమ్మని నౌకరుతో చెప్పెను.

ఇజబెల్ లోనికి వచ్చుటతోడనే మంత్రి ఆమె కొకకుర్చీనిచ్చి కూర్చుండుమనెను అంత

ఇజ—ప్రభువువారు, నాప్రార్థనవిషయమై యేమి జేసిరి?

మం—ఇజబెల్-నీతో చెప్పుటకు విచారించుచుంటిని. ఆతఁడు చావకతప్పదు.

ఇజ—తప్పదా?

మం—తప్పదు, కానికి ఒక్కమార్గమున్నది.

ఇజ—అదేదియో శలవిత్తురా?

మం—శలవిచ్చుటకుముందు నినొ్నకప్రశ్న వేతును మీయన్న జేసినది పొఱబాటనికదా ఆతని క్షమింపమనుచుంటివి.

ఇజ—చిత్తము.

మం—అట్టి పొఱబాటుకు నీవుకూడ తావిచ్చినచో నీయన్న బ్రతుకగలడు.

ఇజ—నాకు మీమాటలు అర్థములెౌట లేదు.

మం—అర్థమునకేమున్నది. నీశరీరమును నాశరీర సౌఖ్యమునకు వినియోగించుట.

ఇజ—పొఱబాటు ఒకడు పడినప్పుడు అది యెఱిగినవాడు ఆ పనియే చేసినచో పొరబాటెట్లగును. అది కేవలము నేఱమే యగును. పఱిగడుపున రెండు అరటిపండ్లెవరు తినగలరు? ఒకటితిని, రెండవది తినకమునుపు పఱిగడుపుతీరినట్లగును. కావున మాయన్న చేసినది పొరపాటైనప్పుడు అతప్పిదమును, మీరు నాచే జేయించుటకు ద్రోహము కాదా? పాపపుపనికి మీవంటిప్రభువులు నావంటి పేదదానిని పురిగొల్పదగునా?

మం—దీనికి నిన్ను నిర్బంధించుట నాయుద్దేశ్యము గాదు. నీయన్నప్రాణములు గాపాడదలచితివిగాన, యీమార్గమును సూచించితిని.

ఇజ—అయ్యా! ఒక సోదరుని ప్రాణములు గాచుటకు ఒక్క చెల్లెలు మానము నమ్ముకొనుటకంటె ఒక్క చెల్లెలు మానసంరక్షణకు పదిమంది సోదరులు మరణముల పాలగుట మంచిది.

మం—అట్లయిన నీవు దూషించిన నాచట్టముకన్నను. నీవే క్రూరురాలవుగా నగుపడుచుంటివే?

ఇజ—నాయన్నను బ్రతికించుటలో ప్రభువుయొక్క క్షమాపణను కోరితినేగాని, ఒక యువతినగు నామాన విక్రయ విధానమునకు తలయూచలేను. నాశరీరము నమ్ముకొని నా యన్నను రక్షించనిష్టపడుదానను గాను.

మం—మనుష్యులు - పురుషులుగానిమ్ము, స్త్రీలు గానిమ్ము, పొఱపడనివారలదు. ఉభయులును చపలచిత్తులై పరస్త్రీ పరపురుషులగోరుచునే యుందురు. అందుకు నీవుమాత్రమేల తీసిపోవలెను? అందును, నీవు స్త్రీవి. పురుషులకంటెను చపలలు స్త్రీలు, కావున నామాటవిని'-అనబోవ.

ఇజ—మీరనినట్లు స్త్రీనగు నేనే మీకంటె చపలచిత్తనగు చో, మీకంటె ముందుగ మిమ్మే నేను కామించియుందును. కాబట్టి యిట్టి దుష్టప్రసంగమును మాని నాయన్నను క్షమించుము.

మంత్రి—యింతీ-యిన్ని మాటలేల, నిన్ను నేను మనస్ఫూర్తిగ ప్రేమించితిని. ఆప్రేమ ఫలితముగ నీయన్నను ఉరిశిక్షనుండి తప్పింతును.

ఇజ—ఒక యువతెను వరించుటచేగదా నాయన్న కుటి విధించితిరి. అట్టి ప్రభువులుమీరే పఱయువతెనగు నన్నెట్లు కామింప సాహసించుచున్నారు.

మం—అధికారినగు నేను నీకు మాటిమాటికి జవాబిచ్చుటకు అవసరములేదు. నీవు నీమానమునైన గోల్పోవలెను. నీయన్న ప్రాణమునైన గోల్పోవలెను.

ఇజ—ఓయీ నీమాటలకు బెదరుదాననుగాను. నీవు జాలి గలిగి నా యన్నను రక్షింతువా మంచిది. లేదా నీదుర్మార్గపుటాలోచనను బహిరంగపఱచి, ప్రపంచములో నీయట్టి ద్రోహి లేడని చాటింతును.

మం—వెఱ్ఱిదానా! నీమాటలు నమ్మువారెవ్వరు? నాకీర్తికెన్నడును కళంకమురాదు. నాతుదిమాట వినుము. నీవు నాకోరిక తీర్చెదవా సరి. లేకున్న నీపైనున్న కోపముచే, నీయన్నను చటుక్కున ఉరి తీయుటకుమారు, చిత్రవధగావించి, అరనిముసములో బోగల ప్రాణమును, అర్ధదినము బాధపడినగాని పోకుండునట్లు చేసెదను.'

అని కన్నులెఱ్ఱజేసుకొని మంత్రి తన గదిలోనికి పోయెను.

ఇజబెల్ తనలో నిట్లు విచారించుచు కోటను విడిచెను.

'అయ్యో, తల్లి బిడ్డకు విసముపెట్టిన, నెవ తేమిచేయుడు? ప్రభువే యిట్టిదారుణమున కొడిగట్ట నెవనితో చెప్పుకొనగలను? దైవమా! నా యన్నకు చావుదప్పనీయనైతివిగదా. కానిమ్ము. నే నిప్పుడే నాయన్న యొద్దకు బోయెదను. అతనికీవార్త తెలిపెదను నాకుటుంబగౌరవమును గుర్తెరిగినవారిలో నాయన్నగొప్పవాడు. ఇట్టి నీచపుబనికై యాతడెన్నడు నొల్లడు. తాను, తనవంటిసోదరులు పది మంది చచ్చుటకైన నొప్పుకొనునుగాని, తన చెల్లెలినగు నామాన విక్రయమున కెంతమాత్రమును యిష్టపడడు.



అసలు రాజుగారు, మంత్రికెల్లు అధికారమునిచ్చి, దేశాటనకు బోవుచుంటినని చెప్పినట్లు చదువరులు తెలుసుకొనిన విషయమే. కాని రాజుగారట్లు దేశాటన అను వంకబెట్టినను, వాస్తవముగ దేశమును విడిచిపోలేదు. ఒక సన్యాసివేషమును వైచుకొని తన పురమునందే, రాజకీయపరిస్థితులను తెలుసుకొనుచుండెను. రాజ్య ములో క్రొత్తరాజరిక మెట్లు సాగుచున్నదో స్వయముగ పరిశీలించు చు, క్రమముగ ఖైదు అధికారియొద్దకుబోయి తను నప్పుడప్పుడు జైలునకు రానీయవలసినదిగ ప్రార్థించెను. జైలుఅధికారి మొదట వీలులేదు అనెను. కాని సన్యాసి ఆతనితో 'అయ్యా! నేనొకసన్యాసిని. జైలులోనుండి శిక్షఅనుభవించువారి బాధలు కొంతవరకు ఉపశమింప జేయుటకు వేదాంతజ్ఞానము మంచిది. అప్పుడప్పుడు బందీలనుజూచి, వారికి జ్ఞానోదయమును గలిగింపజేయుచుందును. నావల్ల నీకేమాట యురాదు.' అని చెప్ప నాయధికారి మంచిదనెను.

రాజు తిన్నగా క్లాడియోయున్న జైలుగదిదగ్గఱకు బోయెను. క్లాడియో దీనావస్థలో నుండెను. తన కేసువిషయమై యాందొంగ

సన్యాసితో నంతయుఁ జెప్పెను. సన్యాసి క్లాడియో యురిశిక్షవిషయమై తెలుసుకొని, ఆతనితో నీవిధముగ సంభాషణము సలిపెను.

సన్యా—క్లాడియో! ఐన నీవు చావవలసిన దేనా ?

క్లాడి—స్వామీ; నాకొక చెల్లెలుగలదు. ఆమెపేరు ఇజబెల్. ఆమెకీ దుర్వార్త తెలియజేసితిని. మంత్రిగారిని ఆమె కలుసుకొనియే యుండును. నన్ను ఆయన క్షమించుననను నమ్మకమొకటి యింకను గలదు. బ్రతుకగలనను ఆశగలిగియున్నను చచ్చుటకుగూడ సిద్ధముగనే యుంటిని.

సన్యాసి క్లాడియోయొక్క ధైర్యమును పరీక్షింపనెంచి యీ రీతిగ ననెను.

సన్యా—ఓ క్లాడియో? నీయాశ చిన్నదిగను, నిరాశ గొప్పదిగను ఉన్నది. దీనినిబట్టి నీకు మరణమే శరణమగునని తలంచెదను. కాని మరణమన్నచో నేమియు భయపడకుము. ఈజీవితము మంచిదా మరణము మంచిదాయని మనము వితర్కించుకొన్న యెడల మరణమే మంచిదని ఋజువుకు రాగలదు. ఏమందువేని జీవితముతో నీవిట్లు తర్కించుకొనుము. జీవమా—నీ వెట్టిదానవు? ఊపిరివి. ఒకగ్రుక్కవు. నీవు యీ ప్రపంచములో ప్రతి చిన్నవిషయమునకును జడుసుకొందువు. చీమకుట్టినచో నోర్చుకొనలేవు చావన్నచో భయము, సంసారమన్నచో భయము. పుట్టుకన్నచో భయము. నీజన్మయంతయు భయముతో గూడియున్నది. నీజన్మలో మిగిలిన సగమునునిద్ర నిద్రావస్థలోకూడ భయమునుండి విడుదల పొందలేవు ఇట్టినీకు సౌఖ్యమనునది లేనే లేదు. ఉన్నదానికి సంతృప్తిపడవు. లేనిదానికి ప్రాకులాడి యెక్కువ తాపత్రయము పడుదువు. పోనీ నీవు భయపడి ఏసౌఖ్యమును పొందకుండినను శాశ్వతమైనదానవా అందువేని అదియునున్న ఉఫ్! అనగా నాఱిపోవు దీపమువంటి బలహీనురాలవు. ధనములకాసింతువు, మూ

టలుముళ్ళు కట్టుదువు. గాడిదవలె, ఆబరువంతయు మోసి తుదకు అనుభవము తక్కువ అలసులు యెక్కువ అయినట్లు మరణము పాల గుదువు; నీకు స్నేహితులున్నారా అన వారును సున్న. ఏమందువేని నీజీవమునకు నీ ఆకృతికి ఆధారమగు నీ అంగములుసైతము నీకు విరోధములౌను కండ్లు గ్రుడ్డివై కాళ్ళుకుంటివై గుండెలలో జబ్బుగలిగి ముక్కుకు రొంపపట్టి కంఠము శ్లేష్మపూరితమై నీ యవయవములు సైతము నీతో వైరముసాధించి నిన్ను బ్రతుకనీయవు అట్టి ఓ జీవితమా మృత్యువుపట్ల భయములు కష్టములు యెక్కువగా నున్నవి. మృత్యువన్ననో తృటికాలములో నీకష్టము లన్నింటిని గట్టెక్కించును. అవి ఆసన్యాసి క్లాడియోతో భావగర్భితములై జ్ఞానముట్టిపడు సరస వచనములు పలికి యూరుకొనెను. క్లాడియో సన్యాసిమాటలకు ముచ్చటజెంది 'మహాత్మా! నీజ్ఞానతేజముచే నాజన్మ తరించినది. యిక నేను మృత్యువు కెంతమాత్రమును వెఱపు జెందను. అని నుడువుచుండ నంతలో 'ఇజబెల' తన యన్నను చూచుటకువచ్చెను. దొంగసన్యాసి యూ వెంటనే క్లాడియోతో తిరిగివత్తు' నని చెప్పి ఆగది కీవలనైపు దాగుకొని ఇజబెల్‌కును క్లాడియోకును జరుగనున్న సంభాషణ వినుటకై నిలబడియుండెను.

ఇజబెల్ వచ్చుటతోనే క్లాడియో కానందమయ్యెను. తెలివి గలిగి సమయస్ఫూర్తిగ మాటాడగల తన చెల్లెలు మంత్రి మనస్సెట్లయిన కఱిగించి తన్ను క్షమించునట్లు చేయగలిగినదని యూహించి యీవిధముగ ననెను.

క్లా—సోదరీ-నీప్రయత్నము ఫలించెనా? లేదా?

ఇజ—అన్నా - నాప్రయత్నమెల్ల వ్యర్థమైనది. రేపే నీకు నూరేండ్లు నిండనున్నవి.

క్లా—ఇక నేదాఱియు లేనట్లే?

ఇజ—లేకేమి యున్నది.

క్లా—ఎట్లు?

ఇజ—తలనిలబెట్టి గుండెలు వ్రక్కలుచేయునట్లు.

క్లా—అయ్యో, నీమాటలు నాకు తెలియుటలేదు.

ఇజ— తెలియుటకేమున్నది. నీతలగాయుటకై నీచెల్లెలిమానమును విక్రయించుట. తెలిసినదా? ఇట్టి అవినీతికర్మకు నీవు సమ్మతింతువా? నీగుండె గుభిల్లుమనదా? మన కుటుంబగౌరవము, నాపరిశుద్ధ జీవితమును మంటగల్పునట్లవదా? ఏమందువు?

క్లా—చెల్లెలు-నేనట్టిపని కెన్నడైనసంగీకరింతుననుకొంటివా? జీవమునైన బాయుదునుగాని, మానమును పోగొట్టుకొందునా? ఇజబెల్ తన యన్న శౌర్యమునకు మిక్కిలి సంతసించినదై అతని పౌరుషము నెంతయో పొగడెను. పిదప క్లాడియోతో, మంత్రి దుర్మార్గతను గుఱించి పూసగ్రుచ్చినట్లు చెప్పి తన కన్యాత్వము నాత డెంత దుర్మార్గతతో కామించెనో తెలియ జెప్పెను. అది విని

క్లా—ఇజబెల్, మంత్రి కింతటి యూహా కలిగినదా?

ఇజ—ఔను. ఇట్టిపాపి యెచ్చటను లేడు. అన్నా నీప్రాణము రక్షించుటకు నాప్రాణములనైన నిచ్చెడిదానను. అట్లుగాక యీతుచ్ఛుడు నామానధనము నపహరించ జూచుచున్నాడు. హా సోదరా! నిన్నెట్లు యెడబాయుదును.' అని వలవల యేడ్వజొచ్చెను. క్లాడియో కన్నులనుండి బొటబొట కన్నీరు గారుచుండెను. ఎట్టకేల కతడు చెల్లెలినిజూచి, 'సోదరీ! మానవుడెట్టికష్టములు పొందుచున్నను వాటి నెంత కాలమైన పొందుచూ బ్రతుకుచుండుటకే ఆసించునుగాని చచ్చిపోవుటకు సిద్ధపడడుగదా? మరణమన్న నెంత భయోత్పాతమైనది. పుట్టుగ్రుడ్డి కానిమ్ము, గర్భదరిద్రుడు గానిమ్ము, యెంత దిక్కులేనివాడైన గానిమ్ము, తన జీవితమును జాలించి మృత్యువాత బడుటకు

జంకుచునే యుండును. 'సోదరీ-సోదరీ' యని యేదియో యనబోయి తలంచుకొనెను. ఇజబెల్ తనయేడ్పు చాలించిఅన్నవైపు తిరిగిచూచి 'ఏమి సోదరా!' యని యడిగెను. క్లాడియో మాటలు తొట్రుపడ జొచ్చెను. తనను విడిచి యాకాసమును, సామెత క్లాడియోయందు వ్యక్తీకరించెను. తన ప్రాణము నెట్లయిన గాపాడుకోవలెనను సహజ కాంక్ష ఆతనికి బుట్టెను. తన చెల్లెలుమానముకంటె తనప్రాణమే ముఖ్యమని నిశ్చయించెను, ఒకనిముసము ఆగి, 'సోదరీ! నన్ను బ్రతుక నీయవా' అని దీనముగ ననెను.

ఇజ—అయ్యో, నాకే అధికారమున్నచో నీశిక్షయే వేయను గదా.

క్లా—చెల్లెలా! అధికార మెందుకు. నీవు అధికారియగుమంత్రి మాటకువొప్పుకొన్నచో నేనుబ్రతుకగలనుగదా! అని క్లాడియోయను టతోడనే ఇజబెల్ మొగముఎఱ్ఱబారి; కన్నులు నిప్పులవలె మెఱసెను.

ఇజ—ఓక్లాడియో—ఎంతమాటనుచుంటివి, ఆహా! పశువు కూడునకాసింతువా? ఈ నీతుచ్ఛజీవమును రక్షించుకొనుటకై అకలంకమగు నీచెల్లెలిజీవితమును మంటగల్పి, వెలయాలిగమార్పజూతువా? ఛీ! తుచ్ఛుడా! ద్రోహీ—అయ్యో! నాతండ్రికడుపుచెడబుట్టితివిరా. నీజన్మకాల్పనా—? అని దిగ్గున నచ్చటనుండి పోబోవ.

క్లా—సోదరీ ఇజబెల్, అయ్యో! అయ్యో! నేను చచ్చుటే నీకిష్టమా ప్రాణదానముచేయవా?' అని యేడ్వజొచ్చుటజూచి

ఇజ—నీవంటి అవివేకి, అభిమానశూన్యుడు; పిఱికిపంద. కులగౌరవనాశనుడు, తప్పకచావవలసినదే; నీవంటిహేయమగు జీవితము గలవాడు, త్వరలోచచ్చినచో. కుటుంబగౌరవము, పరిశుద్ధ్యమునిలుచును. చావుము, మరణించుము; దివంగతుడవుగమ్ము? అని చటుకున నాతనిదాటబోవ. మనదొంగసన్యాసి యామెకడ్డువచ్చి, అమ్మాయీ!

నీతో నొకచిన్నవిషయము మాట్లాడవచ్చితిని. 10 నిముషములిక్కడ ఆగెదవా? యని యడిగెను. ఇజబెల్ సరే యని నిలబడెను. ఇంతలో మనసన్యాసి క్లాడియోదగ్గఱకుబోయి అతనిచెవిలో 'ఓ వెఱ్ఱివాడా నీ యక్క సౌజన్యత కనుగొనుటకై మంత్రి అట్టికోరిక గోరెనుగాని, ఆమె చెఱుపుటకునుగాదు, నిన్ను క్షమించుటకునుగాదు. కావున వెఱ్ఱి మొఱ్ఱియాశలు గల్పించుకొనక, తెల్లవారుటతోడనే స్వర్గప్రయాణమునకు సంసిద్ధుడవుగమ్ము' అని రహస్యముగాబల్కి, తిరిగి వేగముగ ఇజబెల్ దగ్గఱకుబోయి, ఇజబిల్ నీవును, క్లాడియోయును ఏకగర్భజనితులుగదా? అతని కింత చిన్నతనములో నుఱిపాతబడవలసివచ్చినదే! అట్టితఱి నాతని బ్రతికించుట నీకు విధిగదా? యనెను. అందుకు ఇజబెల్ స్వామీ జారత్వముచే సంపాదించిన ధనముగాని, పదవిగాని సంపదగాని, రాజ్యముగాని, పలుకుబడిగాని ఉన్ననేమి? లేకున్ననేమి? అవి కాల్పనా నాయన్న చచ్చినను ఒప్పుదునుగాని వానిప్రాణమును నిలువబెట్టుటకు, చెల్లెలుమానము నమ్ముకొన్నది యనుమాట నేను భరించలేను. అని తీవ్రముగ బలికెను.

మన దొంగసన్యాసి ఆమె ప్రౌఢిమకు మిక్కిలిసంతసించెను. పిదప నామెను దగ్గఱకుబిలిచి ఇజబెల్ నీగౌరవముపోకుండ, నీయన్నను బ్రతికించు నుపాయమును జెప్పెదను. అంగీకరింతువాయని నామె సంతోషస్వాంతయై అయ్యా మిక్కిలి కృతజ్ఞతతో శిరసావహింతు ననెను. అంత నతడీక్రింది విధముగ జెప్పెను.

'ఇజబెల్' ఇప్పుడు రాజ్యముచేయుచున్న మంత్రికొన్నాళ్ళ క్రితము 'మేరియానా' అను నామెను వరించెను. ఆమెపెండ్లికి ఆమె పుట్టింటివారు పెద్దకట్నము యిచ్చెదమని వాగ్దానముచేసిరి. కాని ఆమె తమ్ముడు ఆప్రకారము కట్నముతోకలిసి వచ్చుచుండగా, నోడ మునిగి, యాయువకుడు చనిపోయెను. ధనము సముద్రముపాలయ్యెను

కట్నముముట్టలేదను కారణమున మంత్రి మేరియాను పెండ్లాడక వదలివేసెను. ఆ మేరియా యిప్పుడు యీగ్రామమునందే యున్నది. మంత్రి యెవరుచెప్పినను వినడాయెను. కావున నీవిప్పుడొకపని జేయ వలసియున్నది. నీవు మంత్రియొద్దకుపొమ్ము. ఆతని కోరికకు సమ్మతించితిననుము. రాత్రి నిన్నెచ్చటకు యేసమయమున రమ్మనునో స్థిర పఱచుకొనుము. తరువాత యిచ్చటకువచ్చి మేరియాతో మాట్లాడుదువు. లెమ్ము నీస్థానే ఆమె నీరాత్రి మంత్రియొద్దకుపంపెదము. ఆమె ఆతని కోరిక దీర్చుటకుముందు, నీ యన్నను క్షమించు నధికారపత్ర ము జైలుకు పంపవలసినదిగా కోరుమని చెప్పెదము. ఇజబెల్ నీవు ముందు మంత్రియొద్దకుబోయిరమ్ము. అని చెప్పెను.

ఇజబెల్ సన్యాసి సలహాకు మిక్కిలిసంతసించి తిన్నగ మంత్రి దర్శనార్థమైపోయెను. మంత్రి సంతోషమునకు మేర లేకుండెను. తన తోటలో దక్షిణవైపునున్న తెన్నెయొద్ద తానామెకై రాత్రిపదకొండుగంటలకు వేచియుందునని చెప్పి ఆవైపుముకే ఆమెనురమ్మనిచెప్పెను.

ఇజబెల్ వెంటనేవచ్చి మన సన్యాసిని గలుసుకొనెను. సన్యాసి అప్పటి "మేరియాను' తన యొద్దకురప్పించుకొని సిద్ధముగనుండెను. మేరియాకును ఇజబెల్కును స్నేహముకలిపెను. ఇజబెల్, మేరియాతో 'మేరియా. నాయన్నప్రాణము నీచేతులోనున్నది. నీదేభారమనెను. అంత సన్యాసి 'ఇజబెల్' మేరియాచాల సుగుణవతి, ఆమెవల్ల నీయన్న బ్రతుకుటయేగాక, నామెకును తనభర్తతో పునస్సమాగ మము గలుగు గలదు.' అనెను.

క్రమముగ రాత్రిపడజొచ్చెను. తెల్లవారుజామున 4 గంటలకు క్లాడియో నుఱితీయవలసినదిగా యిదివరలో జైలుఅధికారికి మంత్రి వుత్తరముపంపెను.

ఆ వుత్తరము ప్రకారము జైలరు (జైలుఅధికారి) ఉదయము 4 గం॥లకు క్లాడియోను ఉరితీయుటకు సంసిద్ధుడయ్యెను. మన దొంగ సన్యాసి యా రాత్రి జైలరుయొద్దకు వచ్చెను. రాత్రి 8 అయ్యెను. 9 అయ్యెను. 10 అయ్యెను. రెండుజాములుకూడ నయ్యెను. క్లాడియోను క్షమించవలసినదని మంత్రివద్దనుండి యుత్తరము వచ్చునని సన్యాసి ఆశించెను. కాని యేవుత్తరమును రాకపోవుటచే జైలరు, ఉరితీయునని యెఱిగి, సన్యాసి జైలరుతో నిట్లనెను. 'జైలరూ! క్లాడియోను రక్షించుటకు మంత్రియుత్తరము పంపలేదా?

జై—లేదు స్వామీ.

సన్యా—ఐనచో అతడు చావవలసినదేనా?

జై—చిత్తము.

సన్యా—ఓయీ! నీవల్ల నాకొక యుపకారము జరుగవలసి యున్నది. ఇప్పటిదాక, అతనికి క్షమాపణవచ్చునని యూహించితిని. కాని అది రాలేదు నీవెట్లయినను క్లాడియోను ఉరితీయుట, 2 రోజుల వరకును మానవలెను.

జై—అమ్మో! మంత్రి నన్నురితీయించడా?

సన్యా—వెఱ్ఱివాడా! నీకేమియు భయములేదు. క్లాడియోను చంపితిననియే చెప్పుము.

జై—స్వామీ! అంతటితో మంత్రి ఊరుకొనువాడుకాడు. జైలును పరీక్షించును.

సన్యా—అట్లయిన అతనిని నీయింటిలో దాచుము.

జై—అయ్యా! వట్టిమాటలతో ప్రయోజనములేదు. రాజదండనకు నేను వెఱచువాడను.

సన్యా—ఓయీ! నేనొక రహస్యము చెప్పెదవినుము. క్లాడియోకు యేనేరముపై మంత్రి ఉరిశిక్ష విధించెనో, మంత్రికూడ ఆనేర

మునే చేసినాడు ఇంతకంటె నన్యాయమేమున్నది? రేపు మనరాజు గారు పట్టణమునకువచ్చునని తెలియుచున్నది ఆయనసముఖమున ఈమంత్రి చేష్టలన్నియు తెలియగలవు. నీకేమియు భయములేదు. నామాట విని, క్లాడియోను రెండురోజులాపుచేసి, నీయింట దాచుము. ఉరితీసితినని మంత్రికి వర్తమానముచేయుము నీకే ప్రమాదము సంభవించినను, నీకు నాప్రాణ మడ్డుపెట్టెదను.'

అని అనేకవిధముల జైలరును బ్రతిమాలి దొంగసన్యాసి క్లాడియోను ఉరికంబములనుండి ప్రస్తుతము తప్పించెను.

కోటలో యిక మంత్రి అవస్థ. అనుకొన్నప్రకారము మేరియా ముసుగువైచుకొని ఇజబెల్వలె నటించుచు మంత్రితో శయనించి తెల్లవారకమునుపే ఆతనిని వదలి తిరిగివచ్చెను. మంత్రి తన సరస సల్లాపములలో మునిగి క్షమాపణయుత్తరము జైలుకు పంపడయ్యెను.

తెల్లవారెను. జైలుకు ఇజబెల్ వచ్చి మనసన్యాసిని కలుసుకొనెను. క్షమాపణ వచ్చినదాయని ఆతని నడుగ,

స——రా లేదు. నీయన్న తెల్లవారుజామున 4 గంటలకు ఉరితీయబడెను. ఇజబెల్ నీవేడ్చిన లాభమేమి. ఊరడిల్లుము. ఊరడిల్లుము.

ఇజబెల్ అన్నగారికై వెక్కి వెక్కి యేడ్చి పిదప 'ఓస్వామీ, యిట్టి దుష్టుడైన మంత్రిదగ్గఱకుబోయి వాని రెండుకండ్లను పీకివైచెదనుగాక. హా దైవమా! నాకెట్టిగతి కూర్చితివి! హా క్లాడియో క్లాడియోయని దురపిల్ల సన్యాసి యామె నూఱడించుచు వెట్టిదానా మంత్రిపై నేల కోపించెదవు. అతడు మీకు ప్రభువుగదా. అతనిని మనబోటివా రేమిచేయగలరు. శాంతించుము; అని టక్కరితనముగ నామె నూఱడించెను.

ఆనాడుదయమునసే మంత్రిగారికి అసలు రాజునొద్దనుండి హుకుము వచ్చెను. మంత్రి ఆహుకుమును చదువుకొనెను, అందు రాజుగారు ఉదయము 10 గంటలకు పురప్రవేశము జేతురనియు మంత్రి తన రాజ్యాధికారమును పురద్వారమునసే రాజుగారికి వప్పగింతపెట్టవలెననియు, పురజనులు తమ కష్టనిష్టురములన్నియు రాజుగారికి తెలుపుకోవలెననియు నుండెను. మంత్రి మిక్కిలి ఆశ్చర్యపడెను. తన యధికారమును రాజుగారు పురము ప్రవేశించకమునుపే; వప్పగింతపెట్టవలెననునది రాజునకు పిచ్చియెత్తెనా యనిపించెను. కాని రాజాజ్ఞకు మారుచెప్పుటకు వీలులేక హుకుములోని సంగతులు పట్టణములో ప్రచురపఱచెను.

క్రమముగ 10 గంటలైనది. మంత్రి తదితర ఉద్యోగులతో రాజసందర్శనమునకును, ఆహ్వానము నకును, పురద్వారమునొద్దకు బోయిరి. రాజుగారు రాజఠీవితో మంత్రిమొదలుగాగల రాజోద్యోగులను ఒకసారి చూచి మంత్రి వప్పగించిన అధికారపత్రమును స్వీకరించెను. అంతట కష్టనిష్టురములు తనకు జెప్పుకొనుట కెవరైన వచ్చిరాయని ప్రశ్నించుటకుముందు రాజుగారు మంత్రినిజూచి అమాత్యవరా! అనుకొనినకాలమునకు ముందే మిమ్మందఱను గలుసుకొను భాగ్యము నాకు గలిగినందుకు నేనెంతయు సంతోషించుచుంటిని. మీరందరును నాకిచ్చిన యీస్వాగతమునకు నేను మీకు కృతజ్ఞుడను. మంత్రిపుంగవా నేను మీయేలుబడినిగూర్చి మనరాజ్య మెల్లెడల విచారించితిని. నీవంటి ధర్మమూర్తి, న్యాయశీలుడు ప్రజారంజకుడు, సత్యసంధుడు లేడని విని నామంత్రివి నీవౌటచే నేను మిక్కిలిగ గర్వము నొందుచుంటిని' అనెను.

మం—రాజశేఖరా! ఈ మీహృదయరంజకములగు మాటలచే నేనెంతయు సంతసించుచున్నాను. నాయీ కీర్తికి మీ దయయే కారణముగాని, నాగొప్పతన మించుకయు లేదు.

రా—మంత్రీ! అట్లున్నదు ననకుము. నీకీర్తి జగద్విఖ్యాత మగుటకు నీన్యాయప్రవర్తనము నీజనరంజకతయే కారణము.

అని ఈ విధముగ టక్కులమారిరాజు మంత్రినుబ్బవేయు నంతలో ఇజబెల్ అతి తొందరగ పరుగెత్తుకొనివచ్చి, రాజుకింపుక దూరముగ నిలువబడెను. సన్యాసినిజూచిన వారెవ్వరును గూడ రాజును జూచి పోలికపట్టలేకపోయిరి. అమాత్యాదిరాజోద్యోగులు వెంటరాగ సేవకులు వింజామరలువీవ, భటసమూహముతో, నెమ్మదినెమ్మదిగా పురములోనికి నడచుచు వచ్చుచుండెడిరాజును జూచినదై,

ఇజ—మహారాజా! నీకు జయమగుగాక! జయమగుగాక. అమాయికను, ధర్మచరిత్రనగు నన్నవమాన పఱచిన దుర్మార్గుని, తుచ్ఛుని, దండించి నాకు న్యాయము బ్రసాదింప వేడుచుంటిని. నా మొరాలకించి నన్ను కటాక్షింపవలెను.

రాజు యేమియు నెఱుంగనివానివలె నటించుచు 'ఓయింతీ! నివిచార కారణమేమి. ఎవ్వరవమానించిరి. ఎందుకట్లు జరిగెను! స్పష్టముగా జెప్పుము అనెను.

ప్రక్క నేయున్న మంత్రిమొగములో తేజశ్శూన్యము పొడగట్ట జొచ్చెను.

అంతట,

ఇజ—రాజా! నన్ను కరుణించి సావకాశముగ విని, నామాటల యందు నమ్మిక లేనిచో నన్ను ఖండించుడు నమ్మకమున్నచో నాద్రోహిని ముక్కలుముక్కలుగ జేయుడు.

ఈమాటలు మంత్రివిని యిక తనపేరుపైకివచ్చునని వెఱగంది

మం—'మహారాజా! ఈయువతి కీమధ్య మతిపోయినదని నమ్ముచుంటిని. ఈమె యన్న రెటుకడు చట్టవ్యతిరిక్తమైన నేఱముకై యురి విధింపబడ, నీమె నాయొద్దకు రెండుసారులువచ్చి శిక్ష మాన్పిం

పమని వేడుకొనెను. నేను ధర్మమునకు, చట్టమునకు వ్యతిరేకము నడువలేనంటిని ఆతని మరణమునకై చింతించుచు మతిపోయినట్లు తిరుగుచున్నది.

ఇజ—ఏమి, నీవు ధర్మమూర్తి ననుచుంటివా? యని మంత్రి వైపు రోసముతోను, కోపముతోను జూచెను.

మం—దేవా! యీపిచ్చిది, తనయన్నను ఉరితీయించినందుకు నామీద యెన్నియేని కుట్రలుపన్ని నిందలుమోపనై యున్నది.

ఇజ—ఓరి, పరస్త్రీ మానాపహారా, అధర్మ ప్రవర్తకా, నీ మీదమోపునది నిందయందువా? నీఘోరకృత్యమును మహారాజున కెఱింగించి నిన్నేమిచేయుదునో చూడుము.

రా—మంత్రీ! నీవు చెప్పినట్లిమనిషి పిచ్చిదానివలె నున్న దే! ఓయువతీ, నీప్రసంగము నాకేమియు నచ్చుటలేదు పొమ్మావలకు.

ఇజ—ఓరాజా, నేనబలను. నాకుజరిగిన యన్యాయమును పరాభవమును నీకు విన్నవించుకొనుటకు వచ్చినదానను. నన్ను పిచ్చి దానిగ నెంచుట భావ్యముకాదు.

రా—సరే కానిమ్ము చెప్పవలసినది ఆలస్యము చేయక ముక్తసరిగా జెప్పుము.

ఇజ—ప్రభూ! నేను క్లాడియో అను నాతని చెల్లెలిని. అతడు ఒక కన్యతో చరించెనను నేరముపై యురిశిక్ష విధింపబడెను.

రా—ఆపిదప

ఇజ—ఆపిదప నేనీరాక్షసమంత్రి యొద్దకు క్షమాపణకై పోతిని.

రా—నీకు పిచ్చియని ఋజువుచేసుకొనునట్లు మాట్లాడు చుంటివే రాక్షసమంత్రి యనెదవేల-సరిగా మాట్లాడుము జాగ్రత్త.

ఇజ—చిత్తము. క్షమింప వేడుచుంటిని. అతని కృత్యము రాక్షసతుల్యమగుటచే నట్లు పల్కితిని. మన్నింపవలెను.

రా—ఊ!

ఇజ—దేవా! నేనట్లతనిని ప్రార్థించుటకు బోయి, మోకరించి వేడుకొని, యేడ్చి బ్రతిమాలి, మనసు కఱఁగింప, దేవికిసి యతడు లొంగడయ్యెను. చివఱకు నా నిష్కళంక కన్యాత్వము నాతనికి ధార వోసినగాని నాయన్నను రక్షింపనని పట్టుపట్టెను. నాయన్న యసువులు నెట్లయిన గాపాడదలచిన దాననై యెట్టకేలకు సమ్మతించితిని.

ఇచ్చట ఇజబెల్ కేవలము అసత్యమునే జెప్పినది. దీనికి సన్యాసియే కారకుడై యీవిధముగ చెప్పవలసినదని ఇజబెల్‌ను కోరి యుండును.

రా—తరువాత.

ఇజ—తరువాత నోరాజా, ఈమంత్రి నామానము నపహరించిన వాడయ్యెను, తన యవసరము దీరినదిగదాయని, కృతఘ్నుడై నాయన్ననురికి బంపెను.

రా—ఓయింతీ—నీమాటలు నాకు కడునాశ్చర్యముగనున్నవి. మీయన్న నేనేఱముపై ఉరితీసెనో యానేఱమునే నీయెడల మంత్రియు నల్పునా? అదివట్టికల్ల. అతని నన్యాయముగ పరాభవింపదలచి యిట్లు నిందలాడుచుంటివి. చూడుము. ఇది నీకు పుట్టినబుద్ధి కాదు. ఇట్లు నిన్ను పురికొల్పినది వేరు పురుషుడు కావచ్చు. వాడెవ్వడో చెప్పెదవా లేదా! యని బెదరించెను.

ఆపురుషు డెవ్వడైనది చదువరులు లే యూహించుకొందురు గాక. సన్యాసివేషమునన్న యీరాజుగారే.

ఇజ—హా దైవమా, నాకు దిక్కెవ్వరు. ఓరాజా నామాట నిట్లు త్రోసిపుత్తువా? పదవిగలవారిమాటలు నిక్కువములా! హా! నాకెంత గతిపట్టినది. అయ్యో నాకు తోడునీడయైన ఆసన్యాసియేని, లేడే-యని యేడ్వజొచ్చెను.

రా—ఓహో! సన్యాసియనుచుంటివి అతడెవ్వడు? ఓయీ యెవరైన యీసన్యాసి నెరుగుదురా?

జై—చిత్తముస్వామీ నేనెరుగుదును.

రా—సరే-అతనిమాట తర్వాత నాలోచింతము. ప్రస్తుతము ఈపిచ్చిదానిని జైలునందుంచుము.' అని రాజాజ్ఞనిచ్చెను. తోడనే జైలరు ఇజబెల్‌ను తీసుకుపోయెను.

అంతటరాజు మంత్రివైపు మొగమిడి. మంత్రిసత్తమా! యీ ఇజబెల్, నీవు చెప్పినట్లు పిచ్చిదివలెనున్నదిసుమా. ప్రభు వెంత సరసుడైనను ప్రజల మెప్పునొందుట కష్టముసుమా, యనెను. దానికి మంత్రి హర్షముజెంది, చిత్తమనెను.

అంతట మేరియా ముసుగు నైచుకొని మొగ మగపడకుండగ రాజు నుద్దేశించి ప్రభూ! యనెను.

రాజు ''యెవతె ఈమె' యని ప్రశ్నించెను.

మే—రాజా నన్ను క్షమించుము. నామగడు నన్నాజ్ఞాపించు వఱకును, నేనీ ముసుగుతీయను.

రా—ఏమీ-నీవు వివాహితవా?

మే—కాదు; దేవా!

రా—కాకున్న కన్యకవా?

మే—కాదు మహాప్రభూ!

రా—ఐన వితంతువా?

మే—స్వామీ అదియుగాదు.

రా—అరే ఏమాశ్చర్యము. నీవు వివాహితవుగాక, కన్యవు గాక, వితంతువునుగాక, యిక నెవ్వతెవు?

మే—రాజా నేను చెప్పినమాటవాస్తవము నేను పై మాటింటిలో నెవ్వతెనుగాను, అవవలసెడి వివాహము అవలేదు. నన్ను

వరించిన యూతనినే నేనును వరించితిని. పెండ్లిగాకున్నను అతడే నా మగడు. దానిని నేను ఋజువుచేసికొనగలను. ఇంకొకసంగతి నా భర్తపై ఇజబెల్ అన్యాయముగ నేరారోపణచేసి తనను మాన భంగము జేసినట్లు చెప్పినది. అది యబద్ధము నాభర్త నాతోడనే మెలగినాడు. చాలవత్సరములనుండి యతనిపొందును గోరి విఫలనై నాకు ఆతనితో నిన్నరాత్రియే పొందు లభించినది. ఇజబెల్ చెప్పినది అబద్ధము.

మంత్రి ఆశ్చర్యభయోపేతుడై తొట్రుపడి పులిమీాద పుట్ర యనునట్లీ మేరియా యెక్కడనుండి వచ్చినదిరా దేముడా యను కొనెను,

మం—దేవా ఇజబెల్ కంటె మూాఢురాలుగానున్న దీమనిషి నాతో పొందుగూడినదనుచున్నది?

రా—ఇదిచాల చిత్రముగానున్నదే. ఓమేరియా నీమగ డెవడో చెప్పకుండగ, యేమిటి కీనిందారోపణము నీమాటలు మా మంత్రికీర్తికి కళంకముదెచ్చు నర్థమిచ్చుచున్నవి. నీమగడెవ్వడు?

మేరి—దేవా మీామంత్రియే నాభర్త. నిన్నరాత్రి నేను ఆతని పొందు నేకోరితిని. నన్ను కొన్నిసంవత్సరముల క్రిందట వరించి పెండ్లిచేసుకొనదలచిన దాతడే.

మంత్రికి తత్తరపాటెక్కువయ్యెను.

మం—ఇది చాల నాశ్చర్యముగనున్నది. నీవెవ్వతెవు? యేదీ నీమొగముగపరుపుము అనెను.

ఈయాజ్ఞకయే మేరియా వేచుకొని యున్నది. కావున వెంటనే నామగడే నన్ను ముసుగుతీయవలెనని కోరెను. గావున యిదిగో తీయుచున్నానుః అని ముసుగు పైకి తీసివైచి,

మే—ఓకఠినాత్మా నీవే నాభర్తవు నేనే నీభార్యను.

మంత్రి—తెల్లబోయెను. రాజుగారుకూడ నేమియు తెలియని వానివలె నద్భుతపడజొచ్చెను.

రా—(మంత్రివైపు తిరిగి) ఈమెను నీవెఱుగుదువా?

ఈప్రశ్నకు మంత్రి జవాబు చెప్పవలెను. ఏమనిచెప్పునో చూతము.

మం—దేవా నిజము చెప్పక తప్పదు, ఈమెను నేనెరుగుదును 5 యేండ్లక్రితము మీామెకును నాకును పెండ్లియత్నములు జరిగినవి. కాని యీామెవిషయమై కొంతఅపవాదుగలదని నాకు తెలిసి, వివాహము మానితిని.

ఆమాటలకు నిష్కలంక చరితయగు మేరియా, రోషావేశ పూరితయై కన్నులెఱ్ఱపడ ఓమహారాజా! సూర్యునికి తేజముండుట, సత్యమునకు జ్ఞానముండుటయెంతనిజమో, నామాటలలో యదార్థ ముండుట అంతనిజము. నాయందేదుశ్చరిత్రమును లేకున్నను, కట్న మునావారీతని కివ్వకపోవుటయే కారణముగ, నన్నితడు బహిష్కరిం చెను. నాటినుండియు, నేనీతనిచే మనస్సునందు పరిణయము జేసుకొని నిన్నరాత్రి వీలుచిక్క, ఇజబెల్ పేరుతో నీతనిమోసగించి, యితనితో నుంటిని, నాకీతడే భర్త.

రా—(దొంగ కోపము నభినయించుచు) మంత్రిపుంగవా! స్త్రీలెంతకైన సాహసులు—ఇజబెల్‌ను, మేరియాయును గూడ, కపటోద్దేశములతో, నీయశస్సుకు మచ్చగల్గించుటకై యీాపన్నుగడ లుపన్నిరని యెంచవలసియున్నది. కాని వీరు తమంతట తామీాపని చేసిరనితోచదు. 'దీనికి మూలపురుషుడెవ్వడో యుండవలెను. వానిని గూర్చి మనము విచారించవలసియున్నది' అని, తిరిగి మంత్రితో సరి. వెంటనే ఇజబెల్ పేర్కొనిన యాగన్యాసి యెవ్వడో కబురుపంపుము అతడే ఈమెను నామెనుగూడ, ఋట్టిప్రలాపములాడుటకు పురిగొల్పి

యుండును' అని చెప్పి, తానిప్పుడే తిరిగివచ్చెదననియు, తాను వచ్చు వరకును మంత్రియే తనస్థానమున, కేసువిచారణ చేయవలసినదనియు నాజ్ఞాపించి, రాజు వెడలిపోయెను.

మంత్రికి నష్టపెరుగు గుచ్చెత్తినట్లుండెను. ఏమిచేయుటకును పాలిపోదయ్యెను. ఎట్టకేలకు జైలరును పిలిచి 'ఓయీ! ఆసన్యాసి ముండాకొడుకును తీసుకురావోయి' అని యాజ్ఞాపించెను. అతడు చిత్తము అని వెడలిపోయెను. ఆపిదప నేటొకని బిలిచి, ఇజబెల్‌ను కూడ నొకసారి యిచ్చటకు తీసుకొనిరా' యని చెప్పెను. వాడుపోయి వెంటనే ఇజబెల్‌ను కొనితెచ్చెను. మఱియొక పావుగంటకు జైలరు, తన జైలు ఆవరణలోనే, సన్యాసివేషముతోనున్న మన రాజును తీసుకువచ్చెను. ఆసన్యాసి, తన కాషాయివస్త్రములతోను, కపట గడ్డముతోను, రుద్రాక్షులతోను, వళ్ళంతయు విభూతితో, యెంత మాత్రమును ఆనవాలు పట్టలేనంత నేర్పుతో నుండెను.

ఆవచ్చిన సన్యాసిని జూచి మంత్రిగా రిట్లు ప్రశ్నించిరి.

మం—ఓయీ! నీవేనా యీయిద్దఱు స్త్రీలను పురిగొల్పి ప్రభువైన నన్ను నిందపఱుప జూచితివి?

స—అది అంతయు శుద్ధ అబద్ధము.

మం—ఏమీ? అబద్ధమందువా? నీవెవరియెదుట మాట్లాడు చుంటివో యెఱిగియే యుంటివా?

స—ఆ. నేను పూర్తియగు జ్ఞానముతో నేమాట్లాడుచున్నాను నీపదవికి గౌరవము నిచ్చుచుంటిని, గాని నీకుగాదు. నీవు రాజుకు ప్రతి నిధివేగాని, నన్ను నీవు విచారణచేయుటకు హక్కులేదు. నన్ను రాజే విచారించవలెను. ఏరీ? రాజుగారెక్కడ నున్నారు?

మం—ఓయీ! మేము రాజుగారిస్థానము నలంకరించుటచే, మాయందు రాజుకుగల అధికారముగలదు. నీవు నిజముచెప్పెదవా? లేకున్న జైలుకు పంపమనెదవా?' అని కన్నులెఱ్ఱజేసెను. అంత

స—నేను సన్యాసిని. మీ బెదరింపులకు వెఱచువాడనుగాను ఇది నా దేశముగాదు. దేశదిమ్మరిని. మీరాజ్యములో కొన్నిరోజుల నుండి తిరుగాడుచునుంటిని. మీరాజ్యములో అన్యాయము, అధర్మము, అవినీతి ప్రబలియున్నవి. లంచగొండెతనము, జారత్వము పెచ్చు పెఱిగినవి. మీరాజుకు జ్ఞానముకలదో లేదో తెలియదు. కఠిన చట్ట ములను, చిన్న నేఱములకు వినియోగించుట. అధికారగర్వమున, ప్రజలను దుర్నీతికి గడంగుటఁ కడుశోచనీయముగా నున్నది.

మం—ఏమీ! నీకు పిచ్చిపట్టినట్లు ప్రేలుచుంటి వే. మారాజును, మారాజ్యమును నిందించుచున్నావు. జాగ్రత్త.

స—అయ్యా, నేను నన్నెంతగొప్పగా ప్రేమించుకొందునో మీరాజునుకూడ అంతగా ప్రేమింతును. గౌరవింతును. రాజ్యవిధా నమును నిందించితినిగాని, మీరాజునుగాదు.

మం—ఛీ! దురాత్ముడా, అబద్ధములాడుచుంటివా? ఇప్పుడే రాజును బుద్ధిలేని నిందించి, యిప్పుడే నిందించలేదందువా.'

అని వెంటనే జైలరువైపుతిరిగి "ఓయీ జైలర్ యీ సన్యా సిని బంధించుము' అనెను.

వెంటనే జైలరు సన్యాసిని బంధించబోవ, సన్యాసి తన దొంగ గడ్డమును, జుట్టును లాగివైచుకొని, కాషాయవస్త్రమును విసర్జించి విభూతిని తుడుచుకొని, నిజరూపమును వెలిబుచ్చెను.

మంత్రికి నిలువునప్రాణములు పోయినట్లయ్యెను. ప్రతివానికిని భయాశ్చర్యములు గలిగి కిక్కురుమనకుండ జూచుచుండిరి.

అంతరాజు మంత్రినుద్దేశించి, ఓయీ నీచేసినచర్యలకు, నీ పైని యీయువతెలుమోపిన ఫిర్యాదుకు, నీవేమి యుత్తరు విత్తువు.' అనుచు చఱచఱ లేచి స్వసింహాసన మధిష్టించెను. మంత్రి వెంటనే, రాజపాదములపై బడి.

'దేవా, సర్వాంతర్యామివలెనుండి. నాయపరాథమంతయు వేయికన్నుల జూచుచున్న మీాకేమని మనవిజేతును. నానేరములకు మీారు శిరచ్ఛేదనా శిక్ష వేసినను నేను మనస్ఫూర్తిగా స్వీకరింతును. నేనింతకన్న నేమియు చెప్పసాహసింపను.

రాజు వెంటనే మేరియాను పిలిచి మంత్రితో, సరి, మీారు మాటాడక యీామెను వెంటనే వివాహమాడుము. అని యా ., మంత్రి చిత్తమని ఆమె చేయి తనచేత బట్టుకొనెను.

పిదప రాజు ఇజబెల్‌ను పిలిచి ఇజబెల్-నిన్నుమంత్రి నిన్న రాత్రి అగౌరవపఱచెనని అబద్ధపుసాక్ష్య మిచ్చితివి. దాని కేమందువు:

ఇజ—రాజేంద్రా-అలా నుడువవలసినదని తమరే సన్యాసి వేషమున నున్నప్పుడు సలహా నిచ్చితిరి.

రా—అట్లనా, సరిలెమ్ము. నీవట్లు చెప్పినగాని, మేరియా సాక్ష్యము పైకిరాదు. మేరియా సాక్ష్యముపైకివచ్చినగాని, ఆమె మంత్రి భార్యయగుట ఋజువుపడదు. చివఱకు మంత్రిచేసినది భార్యతోటి పొత్తుగాని, నీతో కాదని తేలినది. దాన నీగౌరవము, నీసచ్చరిత్ర ప్రపంచమునకు వెల్లడియైనది. అందుచే గాబోలు నీకట్టిసలహా నిచ్చితిని. కానిమ్ము నిన్ను క్షమించితినిలే. మరెప్పుడును అసత్యమాడ వలదు.

సరి. ఇకముందుసంగతి చెప్పుచుంటిని. ఈమంత్రి నిన్ను మాన భంగము చేయ యత్నించినాడు. నేను రాజ్యము చేయునప్పుడైనను అమలుపెట్టని చండశాసనమును లేతవయస్కుడగు నీయన్నపై నమలుపెట్టి ఉరితీసినాడు. కావున ఇజబెల్ ఈమంత్రికి దెబ్బకు దెబ్బ తగులవలె కావున క్లాడియోను మంత్రి బలియనవలెను. అని మంత్రి వైపు మొగమిడి ఓయీా నీకు మరణము తప్పదు. సిద్ధముగమ్ము. అని

చెప్పి సైలరును పిలిచి 'ఓ సైలరూ ఈమంత్రిని క్లాడియో నుఱితీసిన స్థంభములమీదనే యురితీయుడు. అని యాజ్ఞాపించెను.

ఈయాజ్ఞ వినుటతోనే మేరియా తనభర్తకు రానున్నముప్పు నుగూర్చి వెక్కి వెక్కి యేడ్చుచు, హా! మహారాజా! నాభర్తను రక్షింపవా. నన్ను గేలిసేయుటకా మావివాహమునకు అనుజ్ఞ నిచ్చితివి? పసుపులోనే ముసుగు వైచెదవా? నానాథుని క్షమించి నన్ను రక్షింపవాయని రాజు పాదములపై బడి వేడుకొనెను.

రా—మేరియా నిన్ను పెండ్లి యను భ్రమతో గేలిచేసినది నేనో నీయీభర్తయో తెలివిదెచ్చుకొనుము. వివాహ మాడెదనని మోసపుచ్చినది యీతడే. ఇదివరలో అతడు మోసపుచ్చెను. ఇప్పుడు నేను మోసపుచ్చక తప్పదయ్యెను. ఇతనురి వేయబడినను నీకు జీవనోపాధిని గల్పింతునులెమ్ము. ఈతని ఆస్థి సర్కారుహక్కైనది. దానిలో కొంతభాగము నీభుక్తికై యిత్తుములే.

మే—అయ్యో నాకేమీ ఈయునక్కర లేదు. నాకు పతిభిక్ష పెట్టుము.' అని రాజు పాదములపై బడి యేడ్వసాగెను.

రా—మేరియా? నీవేమన్నను లాభములేదు. హంతకునికి మరణమే శిక్ష. నీభర్త క్లాడియో నన్యాయముగ నురికితీసిన హంతకుడు. కావున నీవేడ్చిన నేమికార్యము?

ఇట్లు రాజు కృతనిశ్చయుడై నట్లగుపించ, మేరియా గోలుగోలుమని యేడ్చుచు, ఇజబెల్ వైపు తిరిగి 'హా ఇజబెల్ నాకై నీవు కూడ రాజుమనస్సును కరిగించవా? తోటి యువతెవు నాకీ యుపకారము చేయవా? పతిభిక్షపెట్టుట పుణ్యకార్యముగదా యని బొగిలిబొగిలి యేడ్చెను.

రా—ఓ వెఱ్ఱి మేరియా! తనయన్నను ఉరితీయించిన మంత్రికై ఇజబెల్ నీకు సాయపడునా నీకు పిచ్చిపట్టినదా?

అనుటతోడనే సహజకరుణార్ద్రహృదయురాలగు ఇజబెల్ మేరియాదగ్గరకు వచ్చి ఆమెతోకూడ తానును మోకరించి రాజు కాళ్ళపై బడి—

ఇజ—దైవస్వరూపా-మహారాజా నాప్రార్థన నంగీకరించుము. నాయన్నను ఈమంత్రి యురితీయించినమాట నిజమైనను చట్టబద్ధుడై యటుల చేసినాడు. దానికై యతనిని దూషించుట అనవసరము.

ఇక నన్ను గూర్చి యితడవమానము చేయదలచిన మాటగూడ వాస్తవమే. కాని ఇతనికీబుద్ధి పుట్టుబుద్ధికాదని తోచుచున్నది. నన్ను మొదటిసారి చూచువరకును ఇతడు పవిత్రమైన జీవనము గలిగిన వాడే అయి యున్నాడు. నన్ను చూచుటే మొదలుగ నాపై నితనికి మోహము జనించి అధికార గర్వముచే మానభంగము చేయ యత్నించినాడు. కాని, దైవకృపచే నతనియత్నము కొనసాగి నదిగాదు. దీనికంతకు, నాసుందరరూపమే గొంతవఱకు గారణమై యున్నది. కాబట్టి ప్రభువు వారు అవశ్యము మంత్రిని క్షమించి మేరియాకు పతిదానము చేయ వేడుచున్నాను; అని అనేకవిధముల ప్రార్థించెను.

రాజు ఇజబెల్ వైపు చూడనైన జూడక జైలరుకు కనుసంజ్ఞ జేసెను. జైలరు వెంటనే వెళ్ళి తన యింట్లోదాచబడిన క్లాడియోను తీసుకు వచ్చెను. చచ్చిపోయెనని తలచబడిన క్లాడియో తిరిగి ప్రాణముతో నుండుట జూచి సభ వారందఱును ఆశ్చర్యపడిరి మంత్రి మొగము తేజోవంతమయ్యెను మేరియా మొగము వికసించి తన

మొగుడిక బ్రతికెనుగదా యని సంతసించెను. ఇజబెల్ కొంతవఱకు తనకళ్లను తాను నమ్మలేక, నివ్వెఱ పడి, అన్నగారిని ఒకగడియ జూచి, యా పిమ్మట యానందబాష్పములతో నతనిని కౌగిలించు కొనెను.

అంత రాజు—ఇజబెల్‌తో 'ఇజబెల్' ఇతడేనానీయన్నగారు?

ఇజ—చిత్తము, దేవా!

రా—క్లాడియో—నీవు చేసిన నేఱమునకు నిన్ను మంత్రి క్షమించక పోయినను, నేను యిప్పుడు క్షమించుచున్నాను—

క్లా—నాప్రాణదాతలగు మీకు పదివేల నమస్కారములు, అని తనచెల్లెలివైపుదిరిగి 'సోదరీ—నేను మఱణమునకు భీతిల్లి, నిన్ను కూడనిపని చేయుటకు పురిగొల్పినందుకు నన్ను క్షమింపవా? యని బ్రతిమాల

ఇజ—'సోదరా—ఇదంతయు సంతోషించవలసినసమయము పాతసంగతులేవియు తలపకుము' అనెను.

అంత రాజు మంత్రితో—'మంత్రి—పదవివచ్చినదనిగర్వించి కానిపనులకు గడంగుట చాలదోషము.

ఐనదేదోఐనది—నీవు మేరియానుగూడిసుఖించుము క్లాడియో బ్రతుకుటచే నీవును బ్రదికితివి—

అని, పిదప క్లాడియోను చూచి, నీవు యేయువతెను గూడి శిశువును గంటివో ఆమెనే వెంటనే వివాహము జేసుకొనుట కాజ్ఞ నిచ్చుచున్నాను. నీవును నీకుటుంబమును సుఖము గనుడు.'

అని జైలరువైపు మొగమిడి. 'జైలరూ, నీవు, సన్యాసివేష మున నేనున్నప్పుడు, నామాట త్రోసివేయక క్లాడియోను రక్షించి

నందుకు నీకు అభినందము లిచ్చుచు, నీకు యింకను గొప్పఉద్యోగము నిచ్చెదనని యిప్పుడే మాట నిచ్చుచుంటిని.

అని ఇజబెల్ వంకకుతిరిగి, 'ఇజబెల్' నీపరిశుద్ధజీవనముకు, నీ ధైర్యస్థైర్యములకు, నీఓరిమికి నిన్నెంతయు పొగడుచున్నాను. అని యూరుకొనెను.

అంత రాజకీయోద్యోగులలో చాల ముసలివాడగు నొకడు లేచి 'దేవా! మాయందఱికోరికను గౌరవించి, మాప్రార్థనను స్వీకరించగోరుచున్నాము. తమరు యువకులు. అధికజ్ఞానసంపన్నులు. రాజ్యపదవి స్వీకరించినవారు.

ఇజబెల్ నిండు యౌవనవతి; స్ఫురద్రూపి. నిష్కళంక—

ఇట్టి యామెను, అట్టి మీరు వివాహము జేసుకొని సుఖంబుగ నుండవలెనని, మీ పురజనులము మీ శ్రేయోభిలాషులము అగు మేమెల్లరము ప్రార్థించుచున్నాము.

ఈ మాటలా వృద్ధ రాజోద్యోగి నుడువగనే అచ్చటి ప్రజ లెల్లరు కరతాళ ధ్వనులు చేసిరి.

ఇజబెల్ మొగము సిగ్గున వాల్చుకొని చిరునగవు నవ్వెను.

రాజు పరమానందముతో నుండ, క్లాడియో తన చెల్లెలిని రాజుయొద్దకు నడిపించెను. రాజు వికసితవదనుడై ఇజబెల్‌ను పెండ్లి చేసికొని, చాలకాలము ధర్మము ప్రేమ, నాల్గుపాదముల నడువ ప్రజాను రంజకముగ రాజ్యము జేసెను.



# వీనసుకన్య

అప్పుడు సాయంసమయమగుచుండెను. భానుని అంత్యతేజ మా యరణ్యమునందలి వృక్షములందింకను ప్రకాశించుచుండెను. పక్షులు తమ సంధ్యాకీర్తనలు పాడుచుండెను.

అట్టితరి నొక బాలుడయ్యటవీస్థలమునకు మృగయా వినోదార్థమై యఱిగినవాడై, చేతనమ్ములను, దాల్చియుండెను. వయస్సు నడియావనము. బుగ్గలు బాలభానుని వర్ణమును స్ఫురింపజేయు చుండెను. నేత్రములందు సూత్క్మదృష్టికను పట్టుచుండెను. రూపమున, మన్మధుని కేమాత్రము తీసిపోకుండెను. ఆతనిపేరు 'ఎడోనీసు'

ఎడోనీసు అరణ్యములోనికి జేఱుకొనుసరికాతని కెన్నిదినముల నుండియో ప్రేమించుచుండిన 'వీనసు' ఆతనికి తెలియకుండ, నతని వెంటనే వచ్చినదై యతనిని కలుసుకొనెను. 'వీనసు' ఇదివఱకెన్నియో మాఱులు 'ఎడోనీసు'ను వరించి, తనను ప్రేమించవలసినదిగ వేడుకొనెను. కాని ''ఎడోనీసు' ప్రేమయననేమో యెఱుగని అమాయికుడు, ఆహేతువుచే, 'వీనసు' ను ప్రేమించకుండెను. 'వీనసు' విసిగి, విసిగి, యిదియే మంచిసమయమని మదినెంచి, ఎడోనీసును కలసికొని తన తుదిప్రార్థన నాతనికీ క్రిందివిధమున నెఱింగించెను.

'ఎడోనీసు—మనోహరా! భూలోకమున నన్నుబోలిన స్ఫురద్రూపిలేదని ప్రతీతి గలదు. నాతండ్రి రారాజు గావున నాకై వేలకొలది రాకుమారుల రావించి నన్ను వారిలో నెవ్వరినైన నెన్నుకొనవలసినదని కోరెను. కాని వారెవ్వరును నాకు గిట్టరైరి. నాకు ప్రేమ పాత్రుడవు నీవే. నీయందమునుందర నాయందము సహస్రాంశమైన

గాదు. నాచక్కదన మెంత కీర్తివంతమైనదైనను, నన్నుబోలు యువతెలు లోకములో నుండకపోరు. కాని ప్రాణేశ్వరా! మిమ్మునుబోలు యువకుడీ ప్రపంచమున లేడని ఘంటాపదముగ చెప్పగలను. బ్రహ్మ తన సృష్టికై పుణ్యమంతయు నీ యంగసౌష్టవముకై నీసుందరరూపమునకై నీనవయౌవనశోభకై నీమృదుమధుర వాక్చాతుర్యమునకై నీ యసమానలావణ్యముకై వెచ్చించినా నీయట్టి సుకుమారశరీరుడు పుట్టుట కిదియే మొదటిసారి. ఇదియే కడపటిసారి కూడను. ఏమందువా నీవు గతించినపిదప తిరిగి నీయట్టి మోహనాంగుని సృజించుటకు బ్రహ్మశ్రమను దీసికొనడు.

మనోనాయకా! నిన్ను వలచితిని. కాదు కాదు నిన్నే వలచితిని. నాయందు దయగని నాప్రార్థనను స్వీకరించవా'యని వీనసుకన్య ఎడోనీసును బ్రతిమాల నారంభించెను.

ఎడోనీసు అప్పుడు తన గుఱ్ఱము నాపి యామెవైపు తిరిగి చూచెను. కాని గుఱ్ఱమును దిగడయ్యెను. ఊరక నామెను చూచునే గాని పెదవులనైన గదల్పడు. చిత్రప్రతిమవలె నట్లే నిలబడెను.

అంతట వీనసు తిరిగి యాతనితో నాజీవితేశ్వరా సీగుఱ్ఱము నొక్కసారి దిగి నన్ను పలుకరించవా? ఇదిగో ఇచ్చటనే కూర్చుందము. నాహృదయము ప్రేమాగ్నిచే దహించుకొనిపోవుచున్నది. నీ వాగామృత ధారలచే వానిని చల్లార్చుము. నీబుణ మావంతయు నుంచుకొనక వేయి ముద్దులచే నీశ్రమను దీర్చుదానను. అట్లని నన్ను విసిగింతునని తలపకుము, వసంతకాల మెంతకాలమున్నను సంతోషదాయకమే యగునట్లు నాయధర మెంతకాల మెన్నిసారులు గ్రోలినను నీకు విసుగుపుట్టదు. నామాట నమ్ముము. నామాట నమ్ముము' అనుచు ప్రేమచే తపించిపోవుచున్న వీనసుకన్య మెల్లగ మన ఎడోనీసు దగ్గఱకుచేరి యాతని నశ్వముపైనుండి క్రిందికి లాగినదయ్యెను. ఇది

నిజముగ సాహసకార్యమే యైనను ఆమె హృదయవేదనయే అట్టి సాహసమున కామెను ప్రోత్సహించెను.

ఎడోసనునట్లు క్రిందికి లాగినదై వీనసు ఆతని నొకచేతి బట్టుకొని రెండవచేతితో నశ్వము కళ్ళెమును బట్టుకొనెను. ఆమె కన్నులెఱ్ఱనైయుండెను. దానికామె ప్రేమయే కారణము. ఆతని కన్నులు గూడ నెఱ్ఱనినై యుండెను. దాని కాతనిసిగ్గే కారణము.

కొంతసేపటివఱకిద్దఱు నొకరిమొగమొకఱు చూచుకొనుట తోడనే సరిపోయినది. అంత వీనసు తన రెండవచేతిలోనున్న గుఱ్ఱము కళ్ళెమును పట్టుకొని 'నాప్రియూ నీవిప్పుడెచ్చటికి పాఱిపోగలవు? ఒక వేళ నన్ను తిట్టెదవనుకొందము. అప్పుడు నేనేమిచేయుదునో తెలుసునా? నీనోఱు తెఱువకమునుపే నాముద్దులచే నీపెదవుల మూచివైతును? తెలిసినదా' యనెను.

ఎడోసనులజ్జావదనుడై మిన్నకుండెను. ఆతనియుదాసీనతకు వీనసుచింతించికన్నులనీరువిడిచెను. కొంతసేపైనపిదప ఎడోనిసుసాహసించి ఆమె కిట్లు సమాధానముచెప్పెను. నీవుస్త్రీవయ్యును యిట్టిసాహసమునకు బాల్పడుట చాలశోచనీయము. ఇదికేవలము మానహీనమైనపని నన్నువదలుము'అనెను. కానివీనసు ఆతనిని విడిచిపెట్టదయ్యెను. అతడు కోపముచేనిట్టూర్పులు విడుచుచుండనామె దుఃఖావేశముచే బాష్పములువిడుచుచుండెను. ఆమె యాతనిబుగ్గలుపట్టుకొని బ్రతిమాల నాతడామెను తనచేతులతో త్రోసివేయుచుండెను. ఆమె బ్రతిమాలినకొలదియు, ముద్దిడినకొలదియు నాతనికి పట్టరానిరోసమువచ్చెను. ఆతనికి పట్టరానికోపమువచ్చిన కొలదియు నాతనియందమామెకు వేయిరెట్లధికముగ నగుపించెను. అట్లగుపించుటచేనామె యాతని మఱిమఱి బ్రతిమాల జొచ్చెను. ఆమెకోరిన దాతనిప్రేమనొక్కటియేకాని ఆతడివ్వలేని దాప్రేమ నొక్కటిమాత్రమే. ఆమె దీనాలాపములుగాని, కర

స్పర్శనముగాని, అధరచుంబనముగాని,—ఇవియేమియు నాతని నంతయు చైతన్యునిచేయ లేకపోయినవి.

వీనసునకేమియు దోచదయ్యెను. చివఱకు ఓయీ ఒక్కముద్దు మాత్రమిమ్ము నిన్నువిడిచెదను, అనెను. అతడు ఆమాటకు జవాబుగ నీవీవఱకే యెన్నియో సారులువాటిని నాకిష్టములేకున్నను బొంగిలించి తివి యింకనూ కోరుటకు నేనొల్లను. నన్నువదులుము.

వీ—ఆహా! ఇంకనూ కోరుటకు నీవొల్లనందువా? ఏమి! నీ వుట్టేమిమునుగును. ఇంతప్రార్థించిన నన్నుతృణీకరించుట నీకుతగునా? అయ్యో! రారాజుల, కుమారులెందరెందరో నన్నువరించినను, నేను వారిని కాదని, నిన్నేప్రేమించినందుకా? ఏకాసీనూ; నన్నిట్లుకాదనుట ఇదిగో యిటుచూడుము. అయ్యో! ఇది ఏమి ప్రారబ్ధము. తలపై కెత్తవేమి. నేలపైజూచిన నీకేమిగల్గును. తలనెత్తి నావైపుజూడుము. అప్పుడు నాకండ్లలో నీకళ్ళుపడి,నీయందము నీవు జూచుకొనగల్గుదువు. నాకళ్ళపై నీకళ్ళు పడినప్పుడు నాపెదవులపై నీపెదవులు పడకూడదా! ఏమీ నీకు సిగ్గా? సిగ్గనినీవు నీమొగమూవలకు ద్రిప్పుకొనెద నందువా సరి కానిమ్ము. నీవు నీమొగమూవైపు, నేను నామొగమీవైపు బెట్టు కొనిన నేమగును. దినమునేరాత్రిగ జేసెద. గారమగుదుము ప్రేమ యను వెన్నెలగాయుచుండ, కన్నులుమూసుకొనిన వారమగుదుము. పరిమళయుత మగువనమధ్య ముందెండి ముక్కుమూసికొనినవాఱ మగుదుము ఫలవృక్షము దాపునదుండి నోఱుకట్టుకొనినవాఱ మగుదుము. ప్రియా నామాటపెడచెవిని బెట్టకుము. నీవు యువకుడవు. యౌవనము నీటిబుగ్గవంటిదని పెద్దలు చెప్పుదురు. చాలకాలము నిలు వదు. పూవువిడిచిన వెంటనే మనము కోయకున్నచో, వాడిరాలి పోవదా? అట్లే నీయౌవనము సకాలమున నుపయోగించుకొనకున్న నేమిలాభము? కావున తరుణమును వృధపుచ్చకుము.

ఎడొానిసూ! పోనీ, ఒక్కవిషయమూలోచించుము నాయందే మైన లోపమున్నచో జెప్పుము. నేను యుక్తవయస్కను కానా? నేను కురూపినందువా? నాకు వార్ధక్యమువచ్చినదా? కఠినోక్తులాడు దానవా? అంగసౌష్టవము నాకు లేదా? రసికుడా! పైలోపములలో నొక్కటియు నాకు లేదే? అట్టిచో నన్ను నీవేల నంగీకరింపవు?

నన్ను నేను పొగడుకొనుటకై కాదు. కాని నాయందమెట్టిదో తెలుసుకొనుము. నవయౌవనవతిని. వాసనచూడనట్టి పూవును. అద్దములవంటి చెక్కిళ్ళుగలదానను మిసమిసలాడు శరీరముగలదానను సంపెగవంటిముక్కు, మీనములవంటి నేత్రములు, గలిగియుంటిని. నా దేహములతను బోలినదందురు. నాముఖము చంద్రబింబమందురు. నాకురులు మృదువై, పొడవుగలిగి, చూపరులమోహావేశుల జేయును. నాసోయగము వర్ణనాతీతమైనదని ఖ్యాతిగడించితిని. దేవాంగనలు గూడనన్ను జూచి సిగ్గుపడుదురట.

అట్టినాతోనీవు మాటాడనైన వలనిపడదా?

ఒక్కసారి కరుణించి నాతో ముచ్చటింపుము. నీవాక్సుధచే నావీనుల విందుజేయుము. ఇచ్చట నెవ్వరును లేరు. నీవును నేనును దక్క నీకై ఏమిచేయమన్నను జేసెదను. నాట్యమాడుమనెదవా? నా పాదములు భూమినంటెట కుండులాగున అతి చమత్కృతితో నటన సల్పుదును. ఈనాసంతోషమునకు ఈనాబలమునకు ఈనాధైర్య సాహసములకు ఈనాచమత్కృతికి ఎడొానీసూ నాప్రేమయే కారణ మనియూ?

ఓయీ దైవదత్తమైన ప్రేమ నాకిట్టి యపరిమితోత్సాహము గలిగింప నన్నింత నిరుత్సాహపఱచుటకు కారణమేమి? నీకీయౌవన ముండియు సదుపయోగము చేయకుండుట యేమిలాభము? క్రొవ్వు వత్తిని వెల్తురుకై యుపయోగింతుము. ఆభరణములను ధరించుట

కుపయోగింతుము. ఫలములను దినుటకై వినియోగింతుము. పుష్ప ముల నాఘ్రాణించుటకై వినియోగింతుము. ఇవన్నియు వాటికై యవి పుట్టక యితరుల కుపకరించుటకుగదా బుట్టినవి. అట్లితరుల కుపకరించుటకు వలనుపడనివి పుట్టిననేమి పుట్టకున్ననేమి విత్తనములు విత్తనములను పుట్టించుచున్నవి. అట్లే లావణ్యము లావణ్యమును పుట్టించును. కావున మోహనాకారుడవైన నీవును నీయందము నీతో నశింపకుండగ తిరిగి సృష్టించుకొనవలసియున్నది. నీవు నీతండ్రికెట్లు పుట్టితివో నీవును ఒకబిడ్డకు తండ్రివగుట నీకు విధి. అందుచే నాప్రేమ స్వీకరించి నన్ను గైకొనుము.

పుత్రుడు తండ్రియొక్క స్వరూపమందురు. కావున నీస్వరూపమే నీకొమారునికి వచ్చును. దానిచే నీవు గతించిన వెనుక గూడ నీవు బ్రతికినట్లే యగును.' అని వీనసు ఎడొనీసు ననేక విధముల బ్రార్థించెను, ప్రేమవేదనచే నామె యొడలు చెమ్మటలుబోసెను. ఆమెకు నిట్టూర్పు లెక్కువయ్యెను. రాత్రియంతయు గడచెను. తెల్లవారిన పిదప గూడా ఎడోనిసు శిలా ప్రతిమ నేమియు చలింపక తన బ్రహ్మ చర్య దీక్ష చేపట్టి చలించ కుండెను.

క్రమముగ సూర్యుడపరాహ్ణమునకు తిరిగెను, ఎండ వేడిమిచే వారిద్దరును, శ్రమలొందు చుండిరి.

తిరిగి వీనసు అతనిని బ్రతిమాల జొచ్చెను. దాని కతడు అబ్బా నాకీగోల ఏటికి? సూర్యుని తీక్ష్ణకిరణములచే నానెత్తి మాడుచున్నది గదా యని విసుక్కొనెను. అందుకుబదులు వీనసు అయ్యో ఇంత సుకుమారుడవయ్యు నెంత కఠినాత్ముడవైతివి? నామొఱ నెంత పెడ చెవిని బెట్టుచున్నావు! ఏమంటివి? సూర్యకిరణములకు తాళలేనను చుంటివా! భయపడకుము. నానిట్టూర్పుల గాలిచే నీకు చల్లదనము కల్పింతును. మనోహరా, అది నీకు సరిపడదేని, యిటు చూడుము

యీనా కురులనీడచే నిన్ను ఎండ వేడిమినుండి కాపాడెదను. అదియు చాలదందువా ప్రాణేశ్వరా, నాయీ కన్నీటిచే నీయొడలు స్నానము జేయింతును.

ఆహా నీహృదయ మెంతటి పాషాణహృదయము. అయ్యో పాషాణమనెదనేల, రాళ్ళుసైతము వర్షధారచే నఱుగునుకదా, హా! నీవును ఒకతల్లి గన్నబిడ్డనేగదా. ఐనచో ప్రేమయన నెట్టిదో యెఱుగ నంతటి కఠినుడ వెట్లయితివి? ఫలించని ప్రేమ యెట్టిదారుణ సంకటమును గల్పించునో యెఱుగవా! ఎడ్వినూ, నీవింతటి కఠినుడవగుదువని నీతల్లి యెఱిగియున్నచో, నిన్ను కనకుండగనే చనిపోయెడిది సుమా!

హా! మనోనాయకా! మా ఓమాణిక్యమటోయి? నాప్రార్థన నెంత యరణ్యరోదనముగ జేయుచుంటివి?

అని యేనను యెంతజెప్పినను, ఎడ్విను చలించకుండుట జూచినదై, యిక శాంతము పట్టలేక ఆమె వెండియు నిట్లనెను.

'ఛీ! నిర్జీవప్రతిమా! దయావిహీనా! ఛీ! పాషాణహృదయా! నిన్ను మానవుడనుటకన్న, మనుజునివలెనున్న ఒకవస్తువాయని పిలిచిన బాగుండును. మానవుడవేయైన నింత యమానుష ప్రవర్తనము జూపకనే పోదువు.'

అని యాతనిని పలువిధముల దూషించినదై, పిచ్చిపట్టినదానివలెనుండెను. ఒకమారామె యాతనిని దిట్టి, మరియొకసారి తనను తానే తిట్టుకొనును. కన్నీరు కాల్వలై ప్రవహించుచుండ బిట్టుగ నిట్టూర్పులు విడుచును. ఇప్పుడే ఆతని చెక్కిళ్ళుపట్టుకొని బ్రతిమాలును. తిరిగి యిప్పుడే ఆతని నావలకొకింత త్రోసివేయును. ఒకసారి ఆతనివైపదే జూచును. ఒకసారి ఆతని నేమాత్రమును జూడక నేలపైని జూచును. 'అయ్యో' యని పలవించును. తిరిగి ఒకసారాతని

నాలింగనము జేసుకొననెంచును. కాని ఆతడు తిరస్కరించుట జూచి, ఛీ, యని విసుగుజెందును. ఐనను మరొకసారి ప్రయత్నించి, అతడు వలదనుచున్నను తన హస్తములతో నాతనిని చుట్టబెట్టును. అంత నతనితో తిరిగి 'ప్రియా, నిన్ను తిట్టితినని గినియకుము. నాకలహము ప్రణయకలహమని యెరిగి నన్ను మన్నింపుము. నీవు నాచే చుట్టబడి యుంటివి. నీవొక జింకవు. నేనొక ఫలవృక్షసహితమై, జలధారావృతమై, పచ్చికబయళ్ళతో విలసిల్లు పర్వతమును. నీయిచ్చవచ్చినట్లు విహరించుము. నామాట త్రోసిపుచ్చకుము. నాప్రార్థన నంగీకరింపుము.

మనకెక్కువకోపము వచ్చినగాని, ఎక్కువవిసుగుదలతోచినప్పుడుగాని, ఒకప్పుడు చిన్నినవ్వు మన పెదవులయందు తోచుట సహజము. ఆరీతిని, ఎడొనీసు మొగమునందును చిన్నినవ్వొకటి పొడగట్టెను. అతిడట్లు చిరునవ్వు నవ్వినప్పుడతని బుగ్గలయందు చిన్న గుంట గలిగెను. దాన నాతనియందము మఱింత హెచ్చెను. వీనసు ప్రణయానలమును, దానితోపాటు మఱింత హెచ్చెను.

వీనసుగతి మిక్కిలి దైన్యముగ నుండెను. అయ్యో! పాపము, ఆమె యెక్కడకు బోగలదు! ఇకనేమి చెప్పగలదు? చెప్పవలసిన దెల్లను చెప్పినది. అంతకంటె నేమిచేయగలదు? 'హా! ఎడొనిసూ, కాసింత జాలిలేదా, అణుమాత్రము దయజూపవా? అని యామె తిరిగి యను సరికి ఎడొనీసు నూఱుపలుకక ఆమె కరములనుండి తప్పించుకొని తన గుఱ్ఱముదరికి పోయెను.

అంతనతిదీనముగ వీనసు. ఎడొనీసుదరికి, జేరుకొని మోకరించి ఆతని మృదుహస్తములలో తన మృదుహస్తములనుంచెను. ఆమెవైపు పాతటుచూడ నాతని వైపామె కడుజాలిగజూచు చుండెను.

అప్పటివారిదృశ్యము చూపరులకతి భావోద్రేకముగలిగించుచు, రెండు శాతులు ఒకదానికెదురుగ నొకటినిలువ బడినట్లు స్ఫురింపుచుండెను.

తిరిగి వీనసుచలించెను. దుఃఖోద్రేక మెక్కువయ్యెను. ప్రేమ తరంగములలో నా మోహ్యాదయము కొట్టుకొనిపోవుచుండెను. బాష్ప పూరితలోచనయై యాయువిద 'పురుషపుంగవా నాదైన్యము నిన్నిం చుకేనియు చలింపదయ్యెనా నేనుకోరునది అతిస్వల్పమే దానికి నేను నోచుకొననైతినా'యని వగచుటయు, నాతడామెను తిరస్కరించుచు, 'నాచేయివిడువుము' అనెను. దానికామె 'నీచేయివిడిచెదను. సరేకాని, నీహృదయపాషాణత్వమును విడుతువా?'' యని తిరిగి ప్రశ్నించెను.

ఇంతలో ఎడోనీసుగుఱ్ఱము, ప్రక్కనే తిరిగెడి వేటకొకయాడు గుఱ్ఱమునుజూచినదై, చెట్టుకుగట్టబడిన త్రాళ్ళను తెంచుకొని పాటి పోయెను.

అది చూచి ఎడోనీసు వీనసుతో ఛీ—సిగ్గులజ్జలు లేక, నన్ని ట్లేల బంధించి నిర్బంధించెదవు? నన్ను వదలుము. నేను వేటకై వచ్చుటేమి, నీచే నిట్లు బంధింపబడుటేమి. అయ్యో నాగుఱ్ఱముకూడ పాటిపోయినదే. నేను దానినెట్లు తిరిగి తెచ్చుకొందునోగదా? ఆదిక్కు మాలిన యాడుగుఱ్ఱ మెక్కడదాపురించినదో' యని విసుగుకొన జొచ్చెను.

అంత వీనసు—ఓ యువకుడా మానవజన్మమెత్తితివి. కొంచె మూహించుకొనుము. నోటులేని జంతువయ్యును, నీయశ్వ మెట్టి మోహముతో, యెట్టిప్రేమతో, యెట్టి ఉద్రేకముతో, తన త్రాళ్ళను తెంచుకొని తన ప్రేయసికై పఱువెత్తెనో చూడుము. సముద్రమున కైన అంతమున్నదిగాని ప్రేమకులేదు. అది అనంతము అజేయము. చిన్నవాడవు గావున నీబుద్ధిని వినియోగించి నీయీ మాంద్యమును మాని నా మనవివిని నన్ను కృతార్థురాలిని జేయుము. నీయశ్వము

నుండి నీతిని గ్రహించుము. ఆజంతువునుగాని దాని ప్రేయసినిగాని నిందించకుము వాటినుండి నీవు ప్రేమపాఠమును గ్రహించవలసి యున్నది.

దానికి బదులుగ ఎడొనీసు—

'ఓసీ పిచ్చిదానా! ప్రేమ ప్రేమయని యెందుకిట్లు వాపోవు దువు? అది నా కక్కఱలేదు. దానిని గురించిన జ్ఞానము నాకనవస రము. దానిపేరు వినిన నాకు రోత. దానితోటి మైత్రి అపాయకరము. ప్రేమ యనునది మనలను యిప్పుడే సంతోషసముద్రములో తేలి యాడించెను. మఱికొంచెము సేపటికి, అధఃపాతాళమున బడద్రోయును. దానిపొందు విషతుల్యము. అది అశాశ్వతమైనది. నీటిబుగ్గవలె మెఱిసిమెఱిసి చిటికెలో భగ్నమగును. కావున ఓవీనసూ నాచేయి వదులుము. నాకు బాధగల్గింపకుము నాతో నీయసహ్యకరమగు సంభాషణము కట్టిపెట్టుము. ఇది నిష్ప్రయోజనమైనది. నీవెంత వాపోయినను లాభములేదు. నామనస్సు చలించదు. నాహృదయము మెత్తబడదు. నాతీర్మానమున కడ్డుజరుగదు' అనెను.

అంత వీనసు 'ఓయీ! ఏమి నీకు మాట్లాడుటకూడ తెలుసునా? ఆహా నాజన్మ తరించినది. నీకు నాలుకకూడ గలదా? సెబాసు?' అని యించుకసేపాగి ఛీఛీ! ఆనాలుక నీచే నెట్టి వ్యతిరిక్తపుమాటల పలికించుచున్నది. అట్టినాలుక ఉన్ననేమి? లేకున్ననేమి? కాదుకాదు లేకున్ననే మంచిది. ఏమందువా నీకఠినోక్తులచే నాగుండె వ్రక్కలగు చున్నది. నా ఆందోళనమునకు మేఱలేకున్నది. నానిస్పృహకు అంతు లేదు. పాడుదైవము నాకీ కన్నులిచ్చి నీయట్టి మనోహరుని చూచియు చూడనట్లు వీనులిచ్చి నీవాక్సుధను ద్రాగియు త్రాగనట్లు హస్తము లిచ్చి, నీ సుందరశరీరమును దాకియు తాకనట్లు పెదవులిచ్చి నీయధ రామృతము గ్రోలియు గ్రోలనట్లు చేయుచుండెగదా—'యని మిక్కిలి

విచారగముచే క్రుంగికృశించినదై యుండ ఎడ్వోసీను ఆమెవైపు తీవ్రమైన దృష్టినిల్పి యేదో అనబోవుచుండ—వీనను ఆతడనబోవునది గ్రహించెను. వర్షపాతము పడుటకుముందు గాలివీచును. పెద్దపులి అఱచుటకు మున్దు పండ్లికిలించును. తుపాకి ప్రేలుటకుముందు పొగ వచ్చును. అట్లే తీవ్ర కోపోద్దీపితుడై యున్న ఎడ్వోసీను కన్నుతెఱ జేసిన పెదవులు కొఱుకుకొనుచు, దిట్టమగు నిట్టూర్పు వదులు చున్నప్పు డాతెని నోట నెట్టి బెట్టిదంపుమాటలు రానున్నవో వీనను పూర్తిగ గనిపెట్టినదై' దైవమా! ఈతడు నన్నింకను దూషింపనై యున్నాడుకాని, నాకోర్కె దీర్పడు. ఇక నాగతి యథోగతియే యని నేలగూలిన అరటిచెట్టువలె, నరుకబడిన పత్త్రిము భంగి, త్రుంచబడిన పూవుగాగున, నేలబడినదయ్యెను.

ఆమె కన్నులు మూతలుబడెను. ఆమె కురులు నేలపై కొఱిగెను. ఆమె హస్తము భూదేవి నాలింగనము జేసుకొనెను.

మృతజీవివలె గన్పట్టెడి యీ యువతెను జూచి, ఎడ్వోసీనుకు జాలిబుట్టెను. ఆతడు వెంటనే, ఆమె పడినచోటుకు తొందరగ గంతిడి మోకరించి, వంగి ఆమె కరములను స్పర్శించును. చెక్కిళ్ళను తడుమును. నాశిక నొత్తును. తలను లేవనెత్తును. ఏవిధముచేనైనను ఆమె మనోద్రేకమును తగ్గించి స్పృహవచ్చునట్లు జేయుటకై యత్నించెను.

ఎట్టకేలకు ఎడ్వోసీనామె పెదవులకు తన పెదవులు మెల్లగ తగులునట్లు ముద్దిడుకొనెను.

అంతట, ఎండికృశించిన మల్లెమొక్కకు నీరుపోసినచో నెటు క్రమముగ తన శోభను వెల్లడించునో, అట్లాయంగన మెల్లగ తన కన్నులు విచ్చెను. మేఘావృతమైన సూర్యబింబము, మబ్బుపొఱ తొలిగినంతనే యెట్లు ప్రకాశించునో అట్లామె మొగము వికసించెను.

ఆయువతీ యువకులొకరి మొగమొకరు చూచుకొనిరి. వీనసు సంతసమున కంతు లేకుండెను. ఆమె నేత్రము లానంద బాష్ప పూరితములై నిండు చంద్రుడు పూర్ణిమ రేయిని సరస్సునందెట్లు ప్రతిబింబించునో అట్లామె కన్నులు కన్నీళ్ళలోనుండి మెఱయుచుండెను. స్పృహవచ్చిన పిదప నామె 'ఆహా, నేనెచ్చటనుంటిని. భూలోకమేనా యిది. లేక స్వర్గమా; అయ్యో భగవంతుడు నాకు మృత్యువే ఘటింప సమకట్టిన యెడల యీక్షణమం దిచ్చోట నాకు చావును దయచేసిన నేనెంత ధన్యురాలను! మానువునికి, అఖండసౌఖ్యముల నొందుతరి నకస్మాత్తుగ వచ్చిన మరణమే, సుఖదాయకమగు మరణము' అని పూరకుండెను.

దానికి బదులుగ ఎడొనీసు, వీనసూ, నన్నేల కష్టపెట్టెదవు. నేను మూర్ఖుడను. అజ్ఞానిని. ప్రేమయనదేమో తెలియనివాడను. బోడిమ్రానునుండి పూవుల నాసించునట్లు నన్ను నీవెంత బ్రతిమాలిన లాభ మేమున్నది. నీయట్టి సాహసిని నేనెన్నడు జూచియెరుగను.' అని, అప్పటికి సూర్యాస్తమయమగుట గని తిరిగి వీనసుతో, యింతీ- అదిగో సూర్యాస్తమయమగుచున్నది. గుడ్లగూబలు చెలరేగినవి. ఆలమంద లిండ్లకరుగుచున్నవి. పక్షులు కిలకిలారావములు చాలించుచున్నవి. చీకటి గాఢముగ వ్యాపించుచున్నది. నేనిచ్చటకు వచ్చి పూర్తిగ నొక్కదినమైనది. నాకిక శలవిమ్ము. వలయుచో నొక ముద్దయిన గొనుమనెను.

అందుకు వీనసు పట్టరాని సంతోషముగలదై, ఎడొనిసును మనసార కౌగలించుకొని, తనివిదీర ముద్దిడుకొనెను. ఈమాత్ర మంగీకార మాతడు సూచించుటచే నామె మోహోద్రేకము మును పటికంటె వేయిరెట్లధికమై, తన ప్రియుని పదేపదిగ గాఢాలింగనము జేసుకొని లెక్కలేనన్ని ముద్దులు గఱచెను. ఎడొనిసుమాత్రము చిత్ర

పటమువలె నట్లే నిలవబడెను. అప్పుడప్పు డాతడు కన్నులెత్తున జేసెను, మోహాంధతచే వీనసు కన్నుగానక, ప్రియా! నీవేమిచేసినను నేను బెదరుదాననుగాను. గినియుదాననుగాను. ప్రేమసంవృతమైన నాకు నీ చేయుచేష్టలు, విరోధములయ్యును విహితములే ప్రేయసికి, ప్రియుని కోపములే చిరునవ్వులు. అతని తిట్లే ఆమెకు దీవెనలు. ప్రేమ గ్రుడ్డి దయ్యును జ్ఞాని. మనము గులాబిని ప్రేమింతుము. ఆప్రేమచేత నేగదా. ముళ్ళనైనను లెక్కచేయక, దానిని స్వీకరింతుము.' అనుచు నానాతి యాతని ననేకవిధముల మోహావేశునిగ జేయ యత్నించి సంపూర్ణ ముగ నోడిపోయెను. ఎట్టకేల కాతని జూచి ఎడోనిసూ ఇప్పటికైన నిన్ను జయింపలేకపోతిని. నాయాలింగనముచే నీయొడలు కందినది గాబోలు. పోనిమ్ము. నామూలమున నీవు శ్రమనొందుటవలదు కాని ప్రియా రేపు మనము తిరిగి కలుసుకొందము. నీవు తప్పక వచ్చెదవా?'

యని యాతనిని బ్రతిమాలుకొనబోవ తత్క్షణమాతడు నేను రాను. నాకు రేపు అడవిపంది వేటకై బోవలసియున్నది. నేనును నా మిత్రులు కొందరును గలసిపోవుచుంటిమి. అని ఖండితముగ జెప్పెను.

అడవిపందివేటయని యతడు చెప్పగనే వీనసు భయముచెంది అతనితో 'అమ్మో అడవిపందినా నీవు వేటాడుట వలదు. వలదు. అనుచు నాతని బిట్టుగ గౌగిలించుకొనెను.

రంగురంగుల చిత్రములోని ద్రాక్షపళ్ళ బొమ్మనుజూచి, పిచ్చుకలు నిజమని భ్రమపడునట్లు ఎండమావులనుజూచి బాటసారి జలమని భ్రమించిన విధముగ వీనసు ఎడోనీసును రసికుడని భ్రమించెను. కామించెను. కౌగిలించుకొనెను. ముద్దిడుకొనెను ఏమిచేసిన నేమిలాభము?

వీనసు ప్రేమస్వరూపిణి ఎడోనీసు అస్ఖలిత బ్రహ్మచారి వీనసు మనసు నవనీతము. ఎడోనీసుమనసు పాషాణము. ఆమె

ప్రేమించును. అత డసహ్యించును. ఆమె కోరును. ఆతడు కాదనును. 'ఛీ! ఛీ! నన్నుఁబట్టెదవేమి? నన్ను బంధించుటకు నీకు హక్కు లేదు. నన్ను పోనిత్తువా? లేవా? యని ఆమె యొడిలోనుండి గింజుకొన జొచ్చెను.

వీనసు ఆశలన్నియు నిరాశలయ్యెను. ఏమైనను తుదకాతడు బ్రతికెడి యోగమైన గలదో లేదోనని ఆమె భయపడజొచ్చెను. దానికి కారణమాతడు అడవిపంది వేటకుబోవుటకు సమకట్టుటయే.

వీనసు ఆవిషయమై మిక్కిలి జడిసినదై 'ఎడోనీసూ' నీవు నన్ను ప్రేమించి, సంతోషపెట్టక పోయినను నిన్ను నేనెల్లప్పుడును ప్రేమించుచునే యుంటిని, ముందుగూడ ప్రేమించుచునే యుందును. కావున నీ శ్రేయస్సు నాకు ముఖ్యమైన విషయము. నీవిప్పు డడవి పందివేటకు బోవుదునని చెప్పుచుంటివి. అది మిక్కిలి అపాయకరమైన పని, వినుచుంటివా? పెద్దపులినైన సులభముగ నేయవచ్చును. గాని అడవిపందిని వేటాడుట చాల ప్రమాదకరము. దానికోరలు బల్లెములను ధిఃఖరించును. ఆజంతువుకు కోపమువచ్చెనా దానికన్నులు చింత నిప్పులవలె ధగధగ మనును. అది యెక్కడకుబోయినను తాను చంపనున్న జంతువుకై గోతులు త్రవ్వుకొని సిద్ధముగానుండును. దానిముళ్లు వాడివై యీటెలవలె దూసుకొనును. దానిచర్మమందువా సామాన్యపు బల్లెపుపోటులకు లక్ష్యపెట్టదు. పూర్ణమగు నాగ్రహమే వచ్చినచో నాజంతువు సింహముతో పోరుటకు వెనుదీయదు. ముండ్ల డొంకలుగాని తీగెలుగాని అప్పనదూసుకొని పఱుగెత్తగల శక్తి అడవిపందికి యెక్కువగ గలదు.

ఓయువకుడా! అట్టి దుష్టమృగమునా నీవు వేటాడబోవుట? అయ్యో! నీకును దానికిని యెంత వ్యత్యాసమున్నది? నీకరము అతి

మృదువైనవి. పెదవులన్నో పాలముంజెలు. నేత్రములందువా? శీత భానుని లావణ్యముగలిగినవి. ఇట్టి సుకుమారపుంజమాపు నీవేడ అడవి పందిని వేటాడు టేడ!

మనోహరా! బుద్ధిమంతు లెన్నడును తమ శ్రేయోభిలాషుల మాటలు పెడచెవినిబెట్టరు. నేను నీశ్రేయోభిలాషిని గావున నామాట వినుము. వేటకుబోకుము. నీసుస్వరూపమును వినాశము గావించుకొన కుము. అయ్యో! వేటయనిన నాయొడలు వడకుచున్నది. నా కన్ను లకు భయానకముదోచుచున్నది. నాహృదయము కొట్టుకొనుచున్నది. నాతనువను భూమికికంపమెత్తినట్లున్నది. ప్రియా దీనికంతకును కార ణమేమందు? నాప్రేమయేసుమీ!

ప్రాణేశ్వరా! పోనిమ్ము. నీకంత వేటాడుటయందే, కుతూహల మున్నచో, పందియే యననేల మఱేయితరజంతువునైన వేటాడ రాదా! ఉడుత మిక్కిలి పిటికిది. నిరపాయకరమైనది. లేదందువా నక్కగాని జింకగాని, నీవినోదమునకు సరిపడును.

కావున నోఏడోనిసూ, నన్ను మన్నించి నామాటవినుము. నీ జగన్మోహనాకార మీమూడులోకములలోను గూడ సాటిలేనిదై ప్రకాశించుచున్నది. అట్టిదానిని భస్మీపటలముచేసి పాపముగట్టుకొన కుము. నాప్రారబ్ధవశమున నన్నునీవు కృతార్థురాలినిజేయవైతివి. పోనిమ్ముదానికేమి. నీవు యేఅపాయమునకును తావీయక బ్రతికియే యున్నచో, నేను గాకున్నను. మఱేయువతెనైన ప్రేమించి, వంశో ద్ధారకుడవై, నీసౌందర్యమును మృత్యువువాతబడకుండ, నీపుత్ర పౌత్రులద్వారా చిరకాల మీప్రపంచమున స్థాపించిన వాడవగు దువు. నాకదియేపదివేలు అనియెను.

ఆమాటలకు ఎడొనిసు విసుగుజెంది, 'వీనసూ!' నీప్రసంగము చాలించుము. నీమాటల వలన, స్త్రీపై నిష్టముగలుగుటకుమాఱు అయిష్ట మెక్కు వగుచున్నది: నీకు నీప్రేమ నేయి నాలుకలిచ్చి ప్రేలించినను, నేను నీతుచ్ఛపు ప్రసంగములకు లొంగువాడనుగాను. నీ మాటలు హేయము. నీబుద్ధిదుష్టబుద్ధి. నీవాదనకపటవాదన, నీపంథ అపాయకరమైన కామాంధురాలనై యొడలు తెలియక, నా బ్రహ్మచర్యమును మంటగల్ప నెంచుచుంటివి. ప్రేమయట! సంతానవృద్ధికి కారణమట! నీతర్క మెంత నసహ్యముగనున్నది!

ఓసి, నీకున్నది ప్రేమగాదు. పశుతుల్యమగు భోగవాంఛ. దానికిని దీనికిని సహస్రాంశమగు భేదముగలదు. ప్రేమ పవిత్రమైనది. కామము అపవిత్రమైనది. ప్రేమ, వర్షముకురిసి, వెలిసిన పిదప నెండమాదిరిని, మనలను సుఖపెట్టును. కామము, యెండకాసిన పిదప తుపానువలె మనలను చీకాకుపఱచి, దుఃఖపెట్టును. ప్రేమ వసంత ఋతుతుల్యమై యానంద మొసగును. కామము హేమంతఋతువు బోలె, బాధాకరమైయుండును, ప్రేమ సత్యమైనది. కామము మొదటి నుండి తుదవరకును అసత్యములతోకూడినదై యున్నది.

సరి. ఈయుపన్యాసమెంతసేపైనను చెప్పవచ్చును. నాకు కాలముసరిపోదు. ఇప్పటికి యెన్నోగంటలక్రిత మిచ్చటకువచ్చి కాలము వృధబుచ్చితిని' అనుచు ఎడొనిసు, వీనసుయొడినుండి చీల్చుకొని, యావలకుబడి యొకటేపరుగున నెగిఱిపోయెను.

అప్పటికే జిమ్మువ చీకటిపడి చాలసేపయ్యెను. పాఱిపోయిన ఎడొనిసును కొన్ని నిముసములవఱకును వీనసు, నిర్ఘాంతపడి చూచుచు నేయుండెను. అమూల్యములగు ఆభరణము చటుకున చేతినుండి జారి నీటిలోపడినప్పుడు మనమెంత నిరాసతోడను. ఆతుఱతతోడను నీటివై

వుచూచెదమో అట్లే ఆమె తన ప్రియునికై కొంతసేపటివఱకును జూచి యాపై నాత డదృశ్యుడగుటచే, నిర్విణ్ణురాలై యట్టే యొక ప్రతిమవలె నిలబడిపోయెను.

ఆచీకటిని, ఆయరణ్యములో నావీనసుకన్య పడునవస్థ వర్ణనాతీతమైనది. ఆమె తన గుండెలను బాదుకొని వెక్కి వెక్కి యేడ్చెను. ఆధ్వని ప్రక్కలనుండు కొండలోయలలో ప్రతిధ్వనించెను. తన దురదృష్టమునకు తనలో తాను నిందించుకొనును. తన కాతనియెడల నింతప్రేమ కలిగించుటకు దైవమెంత క్రూరుడో యనుకొనును. వేడి నిట్టూర్పులు విడుచును. 'ఉస్సు' అనును ఏడ్పు కొంతసేపు చాలించును తిరిగి యేడ్చును.

ఇట్లు రాత్రియంతయు దుర్భరవిచారముతో కృంగి కృశించినదాటయు, నంత తెలతెలవాఱ జొచ్చెను. క్రమముగ సూర్యోదయమయ్యెను. సూర్యునిజూచినదై వీనసు 'ఓ సూర్యభగవానుడా నీకీ తేజ మెక్కడినుండివచ్చినది. నాప్రియమైన యెడొనీసునుండియేకదా?' అని యచ్చోటి దాపుననేయున్న యొక లతాగుల్మముదగ్గఱకు బోయి ఎడొనీసువేటను గూర్చిన ధ్వని యేదేని వినపడునేమోయని యాలకించెను. కొంతసేపటికి వేటకుక్కల యఱపులు వినజొచ్చినవి. తత్క్షణమామె పఱుగు పఱుగున యావినికిడి దిక్కునుబట్టి పోదలచి యాలతలపొదలలోనుండి వెడలెను. వాటిని త్రెంచుకొని పరుగెత్తునప్పుడు కొన్నిలత లామె మెడను చుట్టుకొనును. మఱికొన్ని తీగెలామె నడుమును కౌగలించుకొనును. కాని వాటినన్నిటిని నామె కోపముతో త్రెంచుకొని, వాయువేగముతో పఱుగెత్తజొచ్చెను.

కొంతసేపటికొక కొండదఱియకు జేరి యచ్చట నొకనిముసమాగి తిరిగి వేటకుక్కల యఱపులకై వేచియుండెను. అవి వినపడి

నవి. కాని వాటి మొదటియఱపులకును యీరెండవ యఱపులకును చాల భేదముండెను. ఇప్పటియఱపులలో యేడుపు ధ్వని వినపడ జొచ్చెను. ఒకబాటసారి తదేకదీక్షతో నడచి నడచిపోవుచుండ దారి మధ్యను మడిచుట్టుకొని పఱుండిన నల్లత్రాచును హఠాత్తుగ జూచిన నెంత భయాశ్చర్యములతో గూడుకొనినవాడై వెనుకకుగాని ముందుకు గాని ఒక్కయడుగైన వేయక నట్లే యేరీతిని నిలబడునో వీనసుకూడ వేటకుక్కల యాక్రందనము విని నిర్విణ్ణురాలయ్యెను.

అట్లుపైని కొంతసేపటికెట్లో భయము చల్లార్చుకొని లేనిధైర్య మును దెచ్చుకొని మరికొంతదూర మామె యేగెను. అచ్చట నొక వేటాడబడిన యడవిపందిని జూచెను. ఆపంది రక్తము నురుగలుగట్ట నూపిరకై పెనుగులాడుకొనుచు కాళ్ళను విలవిల దన్నుకొని 2 నిము సములలో వీనసు చూచుచుండగనే మృతినొందెను. దానియొడలుపై నొక యమ్ము నాటుకొని యుండెను. వీనసు ఆయమ్ము ఎడొనీసు వేసినదై యుండునని గ్రహించెను. పంది చచ్చెనను సంతోషమునకు దోడు ఎడొనీసు గతియేమయ్యెనో యనుచు బెంగ ఆమె నెక్కువగ బాధింపజొచ్చెను. ఒకసారి నాల్గువైపులను పఱికించి చూచెను. యే వైపునను ఎడొనీసు జాడ గానరాదయ్యెను. ఆమె కండ్లనుండి కన్నీరు బొటబొట గారుచుండెను.

హేమంత ఋతువునందు ఉదయమున గులాబి పూవురేకల నుండి మంచుబిందువులు రాలునట్లామె కన్నీళ్లు తుడుచుకొనుచుండ అప్రయత్నముగ మఱల మఱల కొండజలవలె నామె బాష్పవాహిని ప్రవహించుచుండెను. భీతిల్లిన హృదయమున కన్నియు దుశ్శకునముల వలె దోచును. వీనసు యెంతప్రయత్నించి ధైర్య మవలంబించుద మన్నను ఎడొనీసును గూర్చిన కీడేదోచునుగాని శుభసూచన దోచ

దయ్యెను. మేఘములు మెల్లమెల్లగ నాకాశవీధిని గుమిగూడుకొని భూమిపై గొప్ప వర్షపాతమును గురిపించునాయని తమలో తాము తీర్మానించుకొనునట్లు వీనసు ఆలోచనలన్నియు గుమిగూడి ఆమె ప్రియుని కీడునే సూచించుచు, నామెను దుఃఖసముద్రములో ముంచి వైచుచుండెను.

ఇంతలో తిరిగి వేటకుక్కల దుఃఖారవము లామెకు వినిపించెను. తత్క్షణమామె తిరిగి కొంతదూరము శోలకగిమెరుపువలె బరుగెత్తెను. అనతి దూరమరుగుసరికి—తన మనోహరుడగు ఎడోనీసు దేహము, అడవిపందిచే గాయ పరుపబడినదై రక్తము గ్రమ్మి నేలపైబడి, యుండుటజూచి, యాయువిద—'హా' యని నేలపైబడి మూర్ఛిల్లెను.

ఎట్టకేలకు మూర్ఛనుండి లేచి యిట్లని దలపోయ జొచ్చెను.

'హాదైవమా, నాప్రియునికెట్టి దుర్మరణము జేకూర్చితివి? నా కోరిక నీతడు దీర్పకున్నను, అతని ముఖారవిందమైన జూచి సంతృప్తి పడుదుననుకొంటినే? నాకా యదృష్టముగూడ లేకుండ జేసితివా? హా, ఎడోనీసూ-నేనెన్నివిధంబుల జెప్పినను, నామాట పెడచెవిని బెట్టి యెంతగతిదెచ్చితివోయి! దైవమా, నాకుమృత్యువే తత్క్షణము యీనా మోహనాంగుని ప్రక్కనే సమకూర్చిన, నేనెంత ధన్యురాలనగుదును. అనియేడ్చి తిరిగి పిచ్చిదానివలె తనలో తాను 'ఛీ- ఛీ- నేనేడ్చుటేల నాఎడోనీసు, చనిపోవలేదు. ముమ్మాటికిని, చనిపోవలేదు. అదుగో, యీసుందరవదన మాతనిదే, ఆమృదుమధురోష్ఠములు, మాటాడనై యున్నవి. ఆనేత్రముల నాకేవో సంజ్ఞలు చేయుచున్నవి!

అనుచు, వీనసాతని, మొగమున మొగమిడును. ఆతని, చల్లని చేతులు తన చేతులలో జేర్చుకొనును. ఆతని బుగ్గలపై తన బుగ్గల నిడును. కాని, నిర్జీవుడైన యాతనికిక చైతన్య మెక్కడిది?

మఱలమఱల, వీనసుయేడ్చును. హా! ఇక నీపాడు ప్రపంచమున కన్నుల పండువుచేయు వదనమే లేదు. వీనులకు విందు జేయునాలుకే లేదు. ఓఎడొనీసూ, నీముఖారవిందముజూచి ముచ్చటపడ, సింగంబులుసైతము చాటు చాటు నిన్నుజూచి పోయెడివిగా, ఘాతుకమ్మగు వ్యాఘ్రమేనియు నీమృదుగానమును, వినితన యఱపులు మానెడిదిగదా నీసందర్శన భాగ్యమునకై గాను తోడేళ్ళు సైతము తమయాకలినిగట్టుకొని, నోటికడ నున్నగొఱ్ఱెలనైన జంపుటమాని, నీయొద్దకువచ్చి నిలువబడెడివిగదా!' అని దుఃఖించి వెండియుదనలో

'నా' ముద్దుల ఎడొనీసు తన నీడను నీటిలో జూచుకొను నప్పుడు, మీనములు తమబంగారు వన్నెలరెక్కలనాతని ఛాయపై నాని, సంతుష్టినొందెడివికొన్ని పక్షులు, తమసంగీతముతో నాతనికి వీనులవిందుగొలుప మఱికొన్ని పక్షులు తమముక్కులతో ఫలముల నాతని కాహారముగ తెచ్చిపెట్టెడివి. వీటికి ప్రతిఫలమాతని దర్శన భాగ్యమేనని యుప్పొంగెడివి.

అయ్యో! ఈయడవిపంది సైతము నామన్మధాకారునిజూచి, తన్మయత్వము నొందుటకుమారు, అతనిని పొడిచిచంపుటయెట్లు సంభవించెనోకదా!

ఎడొనీసూ నీవులేని ప్రపంచము అంధకారమువంటిది. ఎన్ని నాళ్ళనుండియో ప్రేమించి, ప్రేమించి, చివఱకు నిన్ను గోల్పోతిని. నానిష్కళంకమైన, హృదయపూర్వకమైన, ప్రేమయట్లు అడవిగాసిన వెన్నెలైనదిగాన—ప్రపంచములో ప్రేమయనునది యెచ్చటనున్నను, దానికీశానము తగులుగాక,

ఓప్రేమా—నీవెవ్వానియందున్నను నీకెప్పుడును దుఃఖముతో డగుగాక మొదట నీకుత్సాహము గలిగినను. చివఱకు విచారమే సంభవించుగాక!

... ఓ ప్రేమా! నీ వెప్పుడును నిలకడలేనిదాన వగుదువుగాక. నమ్మించి స్వామిద్రోహము చేసెడి స్వభావము నీకు గలుగునుగాక. నిష్కారణముగ నిందలపాలగుదువుగాక. నీవు గ్రుడ్డిదానవై దేని నాశింతువో అవి నీకు దొరకక తపించి తపించి క్రుంగెదవుగాక—' అని మెన్నోరీతుల ప్రేమను శపించి వీనస్,

'ఓ స్త్రీపురుషులారా! నేటినుండియు మీరు ప్రేమయనుదానిని నమ్మకుడు. అది తుచ్ఛమైనది. క్రూరమైనది. అశాశ్వతమైనది ప్రేమ యనుపేరున పరపురుషుడు పరస్త్రీ నపేక్షించుచున్నాడు. పరస్త్రీ పరపురుషు నపేక్షించుచున్నది. ఈప్రేమయను నది మోసమున కాటపట్టు. భర్త భార్యపై నెంతో ప్రేమజూపి జూపి చివరకు నిష్కారణముగ చిన్నదై తెచ్చి పెట్టుకొన్న యనుమానముపై భార్యను సందేహించి యీ యమాయకు రాలిని పొడిచి చంపును. మఱి యొకడు భార్యను మిక్కిలిగ ప్రేమించును నామె వట్టి జారిణియైనను కాదనియే వాదించుచు సత్యదూరుడై గ్రుడ్డితనమును వహించుచున్నాడు.

ఇట్టిప్రేమ అమాయకులను జంపించునదై దుర్మార్గులను కని పెట్టలేనిదై యున్నది.

ప్రపంచములో నీప్రేమయను పేర మహాయుద్ధములు జరుగును గాక. తండ్రికొడుకులకు తల్లికూతుండ్రకు అన్నదమ్ములకు స్నేహితులలో స్నేహితులకు బంధువులలో బంధువులకు యెడతెగని శత్రుత్వము గలుగుగాక.'

ఇట్లని వీనస్ చాలసేపటివఱకును ప్రేమను శపించినదై ఎడొనీసును కడసారిగ నొక్కసారి ముద్దిడుకొని తనపొడవగు కురులను కంఠమునకు ముడివెట్టుకొనినదై తనప్రియుని యిహలోకమునందు గాకున్న పరమందైన గలుసుకొనలేకపోదునా యను ధైర్యముతో నాత్మహత్య జేసుకొని దివంగతురాలయ్యెను.

---

# రోజలెండు కన్య

పూర్వము 'ఆర్లెండో' అను నొక యువకుడుండెను. అతనికి 'ఆలివరు' అను అన్నయుండెను. వీరు ఒక గౌరవకుటుంబములోని వారు. ఆలివరు, ఆర్లెండోను గురించి యేమాత్రమును శ్రద్ధదీసుకొనక సవతితమ్మునివలె జూచుచుండెను.

వీరికుటుంబములో చాలకాలమునుండి మంచిఅభిమానముతో, నౌకరుగానున్న ముసలివానిని జూచి, ఆర్లెండో యీవిధముగా నొకనాడు మాట్లాడెను. ముసలివానిపేరు 'ఆదాము'

ఆర్లె—ఓయీ 'ఆదామూ' నాస్థితి యెంతదీనముగా నున్నదో జూచుచుంటివా. నాతండ్రికి నాయందెంతో ప్రేమవుండెను. నాదురదృష్టముచే అతడుగతించెను. అంతకుముందే నాతల్లి చచ్చిపోయింది. నా అన్న 'ఆలివరు' నన్ను పాకీవానికన్నను తక్కువగా జూచుచున్నాడు. చదువు చెప్పించడు. లోకజ్ఞానమైన సంపాదింపకుండగా, రాత్రింబవళ్ళు యింటివద్దనే కూర్చోమనును. కట్టుటకు శుభ్రమైన గుడ్డలైన యీయడు. అతని పశువులలో నొకపశువుగ నన్నుకూడ మేపుచున్నాడు. అంతే. పశువుకంటె నణుమాత్రమేని, అధిక్యత నాకు నాయన్నజూపకున్నాడు. ఆదామూ ఇంతకంటె దుఃఖకరమైన అవస్థయేమున్నది? నాతండ్రి నాపై జూపిన ప్రేమయే నన్నింకను ఆత్మహత్య చేసుకొనకుండ జేసినది. లేనిచో యిట్టి హీనసజీవితము కన్న మరణమేమంచిదికదా?

అని ఆర్లెండో తన ముసలిసేవకునితో చెప్పుచుండ, తనయన్న ఆలివరు, ఆసమయమునకే అచ్చటికి వచ్చి నిలబడెను. అంత ఆర్లెండో

ముసలివానిని ప్రక్కకుబోయి వినుచుండమని జెప్పి, యన్నవైపు దిరిగెను.

ఆలివరు చాల క్రూరుడు. తమ్ముని జూడగనే, అతిహేళనగ యిట్లనెను.

ఆలి—'దొరగారు. ఇక్కడేంచేస్తున్నా రేమిటి?

ఆర్లె—ఏదైనా ఒకటిచేయుటకు తగినవిద్య నీవు నాకు చెప్పించితేగదా, యేదైన చెయ్యడం?

ఆలి—ఏడ్చావులే. ఏదో ఒకపనిచేసుకోడానికి విద్యకావాలేం?

ఆర్లె—ఓయీ! నీవు నాకర్మకొలదీ అన్నవైతివిగాని, వేఱు గాదు. నీయింట నన్ను దాస్యముచేయమని నాతండ్రియెన్నడు చెప్ప లేదు. నాతండ్రిధనమునకు నీవుకర్తవైతివిగాని, ఆతని సుగుణసంపత్తికి నేనే కర్తను. నాబాధ్యత నేటినుండి భగవంతునిదేగాని నీదిగాదు. కావున, నీవెట్టిఅధికారము నేటినుండియు, నీవు నాపై జూపకుము. పోవుదము రమ్ము' అని ఆర్లెండో ఆలివరుభుజముపై చేయివైచెను. ఆలివరు అంతట కోపోద్దీపితుడై ఆర్లెండోను ఒకచెంపకాయవైచెను. అప్పుడు సహజబలవంతుడగు ఆర్లెండో అన్నగొంతుకను ఒకచేతితో నొక్కిపెట్టి, 'ఓదుర్మార్గుడా! నీవు నాకు అన్నవగుటచే బ్రతికితివికాని లేకున్న, యీ నా రెండవచేతితో నీనాలుక నీవలకు లాగి త్రుంచి వైచెటివాడను. తెలిసినదా' అనెను. అంత ప్రక్కనే నిలిచియున్న ముసలి ఆదాము దగ్గఱకువచ్చి వారిని విడిపించెను.

ఆర్లెండో అన్నవైపు మొగమిడి 'నాతండ్రి చనిపోవునప్పుడు నీ కేమిచెప్పెనో జ్ఞప్తికిదెచ్చుకొని, నాకు కావలసిన ధనమిమ్ము. దానితో నేనెచ్చటికేని బోయి చదువుకొని, నాపొట్ట నేను పోసుకొందును. మన దేశములో తండ్రికిపుట్టిన మొదటిపుత్రునకేగాని మిగిలినకొడుకులకు ఆస్థిరాకూడదను దుర్మార్గపుచట్టమున్నదే యను

ము. అదివున్నప్పటికిని, పెద్దఅన్నగారు, సహోదరులగు తమ్ముల తిండికి, బట్టకు, విద్యకు ధనమీయ నక్కఱలేదను నర్థములేదు.

ఆలి—సరిలెమ్ము. నీకు కావలసినడబ్బు తీసుకొని దేశదిమ్మరివై తిరిగి ఉన్నది తగలవేసి పిమ్మట ముష్టియెత్తుకొందువుగానిలే.

ఆర్లెండో మఱియేమియు ప్రస్తావన పెంచక ముసలిఆదాముతో నాచోటు విడిచిపోయెను.

ఆలివరప్పుడు తనలో తానిట్లనుకొనెను. 'ఆరిపీడిముండామొయ్య. యీవెధవ కెంతపొగరెక్కినది? వీడి పిండాకుడు వీడికి డబ్బుకావాలిట! వీడి నెట్లయినను అంతముచేయవలెను. అప్పటివరకు నాకు మనశ్శాంతి కలుగదు. దీనికి ఒక్కవుపాయమున్నది మారాజుగారిని అతనితమ్ముడు పదభ్రష్టునిచేసినాడు. రేపే ఆ తమ్ముడు సింహాసన మెక్కునట. ఆసందర్భములో ఒక పెద్దసంబరము జరుగును. విదేశమునుండి ఒక గొప్పకుస్తీవాడు వచ్చియున్నాడు. వానితో నా తమ్ముడు ఆర్లెండు కుస్తీపట్టనై యున్నట్లు తెలిసినది. కావున నేను వెంటనేపోయి కుస్తీవానితో నాతమ్ముని కాలైనను మెడనైనను విరుగగొట్టివేయవలసినదిగా జెప్పెదను.

ఆర్లెండోకు కుస్తీయన్న గొప్ప సంతోషము. వీడిముండామొయ్య నలుగురూ ఆశ్చర్యపడునంతటి బలముకూడా వున్నది. వీని నెంతోమంది ప్రేమింతురు. వీనిసౌందర్యము నందరూ మెచ్చుకొని వీనితో నెంతోస్నేహముగా నుందురు. అందరికీ యీవెధవ మంచివాడేగాని నాకే వీడనిన పరమరోత. వీనిపని నెట్లయినను పైవిధముగ బట్టవలెను.

ఈవిధముగ ఆలివారాలోచించి ఆకుస్తీవానిని కలుసుకొని తనతమ్ముని నేవిధముచేనైనను పొగరడగింప వలసినదిగ నేర్పాటు చేసెను.

ఆదేశమునకు చాల మంచివాడని కీర్తిజెందిన ఒక రాజుగలడు. ఆరాజుకు ఒకతమ్ముడు వుండెను. అతడు బహుదుర్మార్గుడు. అసలు రాజును బలవంతముగ సింహాసనమునుండి తొలగించి అరణ్యముల పాలుజేసెను. అసలురాజుకు రోజలెండను కూతురు గలదు. రాజు తమ్మునికి 'సిలియా' యను కూతురు గలదు. ఆమెకు నీమెకు మిక్కిలి చెలిమి కుదిరెను. వీరిద్దరును ఒక్కకంచములోనే తిని యొక్క మంచముమీదనే బరుండెడివారు. అందుచే పెద్దరాజు అరణ్యముకు బోయినను అతని కూతురు రోజలెండు తన పినతండ్రి కూతురగు సీలియాను వదలలేక కోటలోనే వుండెను. ఒకనాడు సీలియాయును రోజలెండును యీవిధము సంభాషించుకొనుచుండిరి.

సీలి—రోజలెండూ నామాటవిని నీదుఃఖమును చల్లార్చుకొనవా? నాతండ్రి దుర్మార్గుడై పెదనాయనగారిని అడవిపాలుజేసినారు. మనమేమి చేయగలము? ఊరడిల్లుము.

రోజ—సీలియా సోదరీ కన్నతండ్రి కారడవులకేగ నేనాతనితో బోక యిచ్చటనే వుండుటకు నీప్రేమయేకదా కారణము. ఐనను తండ్రి యవస్థను దలచుకొనునప్పుడెల్ల విచార మధికమగుచున్నది.

సీలి—చెల్లెలా నాతండ్రికి నేనుదక్క యింకెవ్వరును సంతతి లేదు. అతని పిదప నాకీరాజ్యమువచ్చును. కాని యీరాజ్యము నా తండ్రి స్వామిద్రోహముచే నా పెదతండ్రియొద్దనుండి సంగ్రహించెను. కావున నేను రాజ్ఞినైనను మరుక్షణముననే దానిని నీకిచ్చివైతును. నామాట నమ్ముము అనెను. అంతలో ఒక సేవకుడువచ్చి కోటలో గొప్ప కుస్తీవాడు వచ్చెననియు అతడనేక బహుమానములు పొంది కీర్తిగడించిన వాడనియు, అప్పుడే యిద్దరు ముగ్గురు పౌరులను కుస్తీలో ఓడించెననియు ప్రస్తుతము యువడో 'ఆర్లెండో' అను

యువకునితో కుస్తీపట్టనై యుండెననియు నాకన్నియలతో జెప్ప సీలియా రోజలెండులు తత్క్షణము కోటలోనికి పోయిరి.

సీలియాతండ్రి, అనగా ప్రస్తుతము రాజ్యముచేయు చిన్నరాజు సభదీర్చి కూర్చుండి, యీయిద్దరు యువతెలు వచ్చుటతోనే వారికి రెండుకుర్చీలు వేయించెను. యీచిన్నరాజు రోజలెండు అనిన, యిష్టములేకున్నను, తనకూతురుతోనున్న చెలిమినిబట్టి ఆమెనుకూడ ప్రేమించుచుండెను.

కొలదిసేపటిలో కుస్తీప్రారంభమయ్యెను. ఆర్లెండో, తనపోటీదారునికన్న చాలచిన్నవాడౌటచే చూచువారెల్లరును, అతనిపై చాల జాలిగలిగి యుండిరి. ముఖ్యముగా రోజలెండు హృదయము యెక్కువ పరితపించుచుండెను. ఆర్లెండో సౌందర్యమునుజూచి ఆమె విస్మయమొందెను.

కొంతసేపటివరకును ఆర్లెండోకును, కుస్తీవానికిని ముష్టియుద్ధము జరిగెను. ఇరువురును కడుభయంకరముగ యుద్ధము జేసిరి. ఎట్టకేలకు చూపరుల కందరకు, ఆశ్చర్యానందములు కలుగునట్లు, ఆర్లెండో, గెలుపొందెను. కుస్తీవాడు పడిపోయెను. జనులందరును చప్పట్లు కొట్టిరి. రాజుకూడ చాల యద్భుతపడెను. రోజలెండు మొగము వికసించెను. రాజంతట ఆర్లెండోను పిలిపించి, 'ఓయీ నీపేరేమి? నీ వెవ్వరికొడుకువు? ఇంతచిన్నవాడవు, నీకీబలమెక్కడిది' అని ప్రశ్నింప,

ఆర్లెం—రాజా, నేను ప్రఖ్యాతిగాంచిన రోలెండు, కుమారుడను, అని మరేదియో యనుచుండ రాజు, పైమాటలు వినగనే, ఓయీ-నీతండ్రి రోలెండు, నాకు పరమవిరోధి నీశక్తికి నేనెంత మెచ్చుకొన్నను, నీవు రోలెండు, కుమారుడవౌటచే, నా అభిమానమునకు నీవు దూరుడవైతివి. సరి, నీదారిని నీవుపొమ్ము, అని రాజు దిగ్గునలేచి పోయెను. ఆర్లెండో మొగము చిన్నబుచ్చుకొనెను. ఇతనితండ్రి పెద్ద

రాజుకు కడునమ్మకమైనసేనానిగనుండెను. ఆకారణమున నీచిన్నరాజు అతని పేరనిన మండిపడజొచ్చెను.

ఆర్లెండోకును రాజునకును జరిగిన ప్రస్తావన, సీలియా రోజలెండులు వినిరి. రాజావలకుబోయినపిదపఆర్లెండోను బిలిచివారిద్దరును ఆతని బలమునకు మిక్కిలిస్తుతించిరి. రోజలెండు తన కంఠహారమును దీసి, ఆతనికిచ్చుచు, ఆర్లెండో, నీతండ్రికిని నాతండ్రికిని ఒకటేప్రాణము. అందుచే నీవును నేనును స్నేహితులమైతిమి. ఇదిగో ఈకంఠహారమును దీసుకొనుము. నీశక్తి సామర్థ్యములను యీనాడు కళ్ళార గాంచుటచే నేనిది నీకు బహూకరించితిని. ఈబహుమతి చాలస్వల్పమనియెఱుగుదును. కాని, ఇంతకన్న నెక్కువగ సత్కరించుటకు, యిప్పటి నాస్థితిచాలదు. ఇదిగైకొనుము, అనెను.

ఆర్లెండో రోజలెండు చేతిలోనుండి, కంఠహారము నందుకొనునప్పుడాతని యొడలు పులకరించెను. రోజలెండువంటి యువతి యీ ప్రపంచములో, యేయందగత్తెలలోగాని లేదను నభిప్రాయము పడజొచ్చెను.

కొంతసేపటికి సీలియా రోజలెండులు అచ్చోటువిడిచి కోటలోనికి బోయిరి.

ఆర్లెండో చాలసేపటివఱకును అక్కడనేయుండి, రోజలెండుకు తనయందు యెంతప్రేమయున్నదో యని ఆశ్చర్యానందములలో తన్మయత్వము జెందుచుండెను. అంతలోనేరాజుదగ్గరనుండిఒకసేవకుడువచ్చి 'ఆర్లెండో–నీకుఒకవిచారకరమైనవార్తజెప్పవచ్చితిని కానిఅదినీమేలుకొఱకే యనియెఱుగుము' అనెను. అప్పుడు ఆర్లెండో, రోజలెండు ప్రేమతరంగములలో పరవశుడై యుండుటచే సేవకునిమాటలు వినిపించుకొనక, అతనితో 'ఓయీ ఈరోజలెండనునామె, ఇప్పటిరాజుకేమగును?' అని ప్రశ్నింప, నాసేవకుడురోజలెండు ప్రస్తుతపురాజుకు అన్న

కుమార్తెయని చెప్పి, ఆపిదప, 'ఆర్లెండో, నేను చెప్పెడిమాటముందుగా వినుము. మనరాజు నీబలశౌర్యములకు మిక్కిలి ఆశ్చర్యముపొంది నను, నీతండ్రి తనకు శత్రువుడౌటచే, నీవును అతనికి విరోధివనితలచి, నిన్ను దేశమునుండి వెళ్ళగొట్టుటకు తలచుచున్నాడు. కావున, అతడు నిన్నుపొమ్మని ఆజ్ఞాపింపకముందే, పాఱిపోయిన నీకుశ్రేయస్కరము. ఇది నీమేలుకోరి చెప్పితిని. ఆపైని నీయిష్టము.' అని చెప్పెను.

ఆర్లెండో ఆసేవకుని సలహాకు చాల సంతసించి సరే అనెను.

కోటలోకి పోయినపిదప సీలియా రోజలెండులు యిట్లు నూట్లాడుకొనిరి. రోజలెండు విచారముగా నుండుటచే, సీలియా ఆమెను ఓదార్చనెంచి

'రోజలెండుచెల్లెలా, ఏమమ్మా నీవంత విచారముగానుంటివి. అస్తమానము నీతండ్రికై అస్తమానముపూని, విచారించిన నేమి లాభము.

రోజ—అక్కా, నావిచారమునకు కారణమదికాదు. నా తండ్రిని గురించి అనుటకన్న, నన్నుగురించియే నేను చింతించుచుంటిని.

సీలి—అదెట్టిది? నీమాటలు నాకర్థము అగుటలేదు.

రోజ—సీలియా! వయసులో నున్నదానవు, నాచర్యనుబట్టి నీవర్థము జేసికొనలేవా. ఆర్లెండోవంటి వీరుడు ఎవడైనగలడా.

సీ—అట్లనా, తెలిసినది. తెలిసినది. నీవిచారకారణమిదా! కాని రోజలెండూ, ఆతడనిన నీకెంతప్రేమ ఎంతలో కలిగినదే!

రో—ఏమోనే నాకే తెలియకున్నది. కాని, ఆతని తండ్రి నాతండ్రికి స్నేహితుడౌటచే, అతనితో చెల్మిచేయుటకు నాకును కోరికగా నున్నది.

సీ—అట్లయిన, నాతండ్రి కతనితండ్రి విరోధుడౌటచే, అతనితో నేను విరోధము సాధించవలసి యున్నది.

రో—అక్కా, అక్కా, అతనివంటి సుగుణసంపన్ను డెవ్వ డును లేడే. నన్నుబట్టియైన అతనితో విరోధము నీకు వలదే' అని సీలియా చేతులు రోజలెండు పట్టుకొని బ్రతిమాల,

సీ—ఓసి పిచ్చిదానా, నవ్వుతాల కంటెనిగాని ఆర్లెండోపై విరోధము సాధింతుననుకొంటివా యేమి?' అనెను. అంతట రోజలెండు మొగము వికసించి, తనమనోహరు డనిన, సీలియాకుగూడ గౌరవము గలదని హర్షచిత్తురాలయ్యెను.

ఇంతలో రాజు అచ్చటకు వచ్చెను. అతని మొగమెర్రబారి కండ్లు చింతనిప్పులవలె నగుపించుచుండెను. సహజముగ దుర్మార్గు డౌటచే, అతని విగ్రహమే చూపరులకు భయోత్పాతముగనుండెను.

అట్లువచ్చి రోజలెండునుజూచినవాడై ఓసీ, రోజలెండూ, నీవు తక్షణము కోటవిడిచి ఆవలకుపొమ్ము'' అనెను. ఆమాటవినుటతోనే, రోజలెండు నివ్వెరపడి కొంతసేపటి వరకును. పినతండ్రిమాట నమ్మక పిదప యిట్లనెను.

రో—'బాబయ్యగారూ-ఏమనుచున్నారు? నన్నేనా మీరు కోటవిడిచి పొమ్మనుట.

రాజు—ఔను. నిన్నే. నీవు నారాజ్యమువిడిచి పోవుటకుగాను 10 రోజులు గడువొసగితిని. కోటను మాత్రము వెంటనే విడువవలెను. అట్లు 10 దినములలో నారాజ్యము విడువనిచో నీకు ఉరిశిక్షయే శరణ్యము.

రో—బాబయ్యా-మీఆజ్ఞ మీరెరిరింగించితిరి. కాని, నావల్ల నేమినేరమున్నదీ తెలవిచ్చితిరికారు. కావున దయయుంచి నా తప్పే దైనయున్నచో, అదితెలపీయగోరెదను. నేనెరిగినంతమట్టుకు, ఏవిధ మైన నేరమూ జేసి యెరుగను.

రా—నీవంగిమాటలకేమిలే. రాజద్రోహులందరును నీకు వలెనే, చమత్కారముగ మాట్లాడుదురు. నాఆజ్ఞకు నీకు కారణము చెప్పవలెను కాబోలు. నీయందునాకు నమ్మకము లేకపోవుటయే కారణము. తెలిసినదా?

రో—రాజా అది సహేతుకమైన కారణముగాదు. నన్ను మన్నించి నాయపరాధ మేదని యున్నచో అది తెలుపగోరెదను.

రా—నీతండ్రికి నీవు కూతురువౌటయే నీయపరాధము' ఇప్పుడు తెలిసెనా?

రో—ఆహా! నాతండ్రికి నేను కూతురునౌట ఈనాడు జరిగినదా? ఇదివరలోను కూతురునే. ఇప్పుడును కూతురునే. మున్ముందును కూతురునే. రాజద్రోహమునకును నాతండ్రికి నేను కూతురునౌటకును ఏమైన సంబంధమున్నదా' అని వలవల యేడ్వజొచ్చెను. అంతట సీలియా తండ్రికి నమస్కరించి.

సీ—నాన్నగారూ రోజలెండు నిరపరాధి ఆమెకిట్టి అకారణ శిక్ష విధించుట న్యాయము కాదు'అని మొఱవెట్ట రాజామెను త్రోసివైచి 'ఛీ తెలివితక్కువదానా నీమూలముననే రోజలెండును ఇన్నాళ్లు నీదగ్గఱనుంచితిని. లేకున్న దానితండ్రితో నది యీవఱకే అడవులకు త్రోలబడియుండెడిది.

సీ—నీమూలమున అనెదరేల నేనప్పుడు కోరకుండగనే మీరంతట మీరే దీనిని వుంచితిరి. అప్పటి మీచిత్త మట్లుండెను. నాటినుండియు రోజలెండును నేనును ఒకచోటనే నిద్రించుచుంటిమి. ఒకచోటనే భుజించుచుంటిమి. ఒక్కచోటనే ఆడుకొనుచుంటిమి. ఇన్నాళ్ళనుండి పెంచి పోషించిన మాప్రేమానుబంధమును స్నేహము చటుక్కున యీరోజున మీరు త్రుంచదలచుకొనుట ధర్మము కాదు.

రా—ఓసీ! తెలివితక్కువదానా! రోజలెండు గడుసుదనములో నీకు లక్షవంతు లేదు. అది గడసరి. నోటను వావియు లేనిదానివలె వగుపించు నంగనాచి. అందుచే దాని నందరు పొగడెదరు. దాని మూలమున నీకు పూరును పేరునుకూడ లేకుండపోయినది. కావున అది ఎంతశీఘ్రముగ వెళ్ళగొట్టబడిన నీకు అంతత్వరలో పేరుప్రతిష్టలు వచ్చును. తెలిసినదా? కనుక నువ్వు నోటుమూసుకొనుము. నాఆజ్ఞకు తిరుగులేదు. రోజలెండు యీనాడు మన కోటవదలి తీరవలెను.

సీ—అయ్యో! మీదండన నామీదకూడ నుపయోగించుడు. నన్నుకూడ రోజలెండుతో గెంటివేయుడు. అది లేకుండగ నేనొక్క నిముసమైన బ్రతుకలేను.

రా—'ఛీ మూర్ఖురాలా! నోటుమూయుదువా? రోజలెండూ. నీకిదే కడసారిగ నాయాజ్ఞను దెలుపుచుంటిని. ఈ పదిరోజులలోనూ నారాజ్యమును విడువవలెను. లేకున్న నీకు చావు తప్పదు.'

అని రాజు వెడలిపోయెను. అంతట సీలియా రోజలెండులు ఒకరి నొకరు కౌగలించుకొని చాలసేపటివఱకును యేడ్చి యేడ్చి ఒకరి నొకరు యెడబాయకుండుటకు యేదేని యుపాయమున కాలోచించిరి.

చివఱకు వారికొక యుపాయము తట్టెను. ఇద్దరును మఱునాడు తెల్లవాఱక మునుపు కోటను యెవ్వరికి తెలియకుండ వదలి పాఱి పోవుట. వారి ఆభరణములనమ్మి కొంతధనమును చేకూర్చుకొనుట. రోజలెండు స్త్రీవేషమునుమార్చి పురుషవేషములను వేసుకొనుట. మాఱుపేరులతో రాజ్యమును విడిచి ప్రయాణము సాగించుట నమ్మకమైన రాజసేవకులలో నొకనిని తోడుగా తీసుకొనిపోవుట.'

ఇట్లాలోచించుకొని ఆయువతె లిద్దరును మఱునా డుదయమున నే కోటవిడిచి పోయిరి.

ఇదివరలో అసలురాజు రాజ్యమునుండి వెళ్ళగొట్టబడెనని తెలుపబడినది. అతడున్న యరణ్యము దట్టమై ప్రకృతిసౌందర్యమును వెల్లడించుచుండెను. ఆవృద్ధరాజు అడవిలోని జీవితము పురజీవితముకంటె వేయిరెట్లు సుఖముగానున్నట్లు భావించుకొనుచు అనుచరులగుకొందరు రాజభక్తిపరులతో గూడి సుఖముగ కందమూలాదులను దినుచు గాలక్షేపము జేయుచుండెను. ఆరాజు అనుచరులలో జాకు ఒకడు. ఇతడు ఒక విదూషకుడు. ఇతని మాటలు, ఊహలు, రాజునకును ఇతరులకును కడుపుబ్బ నవ్వుపుట్టించును.

అడవిలో ఒకభాగమందు వృద్ధరాజు, అనుచరులును కాలక్షేపము జేయుచుండగా, సీలియా రోజలెండులు ఆఅడవికే వేరొకభాగమున ప్రవేశించిరి. వీరిద్దరితోను 'టచ్చి' యను హాస్యగాడు కూడ వచ్చెను. ఈ 'టచ్చి' చిరకాలము కోటలో బంటుగా నుండెను. వీనిని తమకు సహాయార్థముగ సీలియా రోజలెండులు తమతో గొనివచ్చిరి. ఆయువతెలిద్దరిలో రోజలెండు అచ్చముగపురుషరూపమును వేసుకొని నవయౌవన బాలునివలె గన్పడుచుండెను. సీలియా స్త్రీరూపములోనే వుండెను. అడవికిట్లువచ్చి నడువలేక నడువలేక, ఎట్టకేల కొకచెట్టు నీడ గూర్చుండిరి.

వీరికథ అటుంచి, ఆర్లెండో సంగతి కొంతవిచారింతము. అన్నచే యిల్లువెడలగొట్టబడి, రాజుచే రాజ్యమునుండి వెడలగొట్టబడి ఆర్లెండో తన ముసలిసేవకుడగు ఆదాముతో కష్టబడి నడిచి నడిచి, చివరకు వృద్ధరాజున్న ఆడవిభాగముకుజేరుకొనెను. అప్పటివృద్ధరాజు తనపరివారముతో, అడవిలో వేటాడబడిన మృగములమాంసమును, దుంపలను భుజించుటకు సిద్ధముగ నుండిరి.

అప్పుడు సూర్యుడు నెత్తికిసూటిగ ప్రకాశించుచుండెను. ముసలి ఆదాము, ఇకనో, యిప్పుడో అనునంతవఅకు డస్సియుండెను. ఆర్లెండో కూడ ఆకలిబాధచే నొడలు తెలియని వేదన పడుచుండెను.

అంతట ఆర్లెండో, ఆహారమును భుజింపనైయున్న వృద్ధరాజు దగ్గఱకు వచ్చి, అతనితోను, అతని ప్రక్కనున్న పరివారముతోను యిట్లనెను.

ఆర్లెం—ఓయీ మీరెవ్వరైనను సరే ఒక్కమెతుకైనను నోటిలో వేసుకొనకుడు. లేకున్న యీ నాఖడ్గముతో మిమ్ముల నరికి వైతును, అని తనఖడ్గమును చేతబూనెను.

అంతట రాజు ప్రక్కనున్న జాక్కు (విదూషకుడు) ఆర్లెండో వంకకు తిరిగి—ఓయీ, మేమేమియు నింకను తినలేదే? తినబోవువారిని మమ్మిట్లు తినరాదనుటకు నీవెవ్వరవు?

ఆర్లెం—మీరు తినలేదని నేనెఱుగుదును. తినకూడదని ఆజ్ఞాపించుచుంటిని నాముసలి సేవకుని అవసరము తీఱువరకును. మీనోటిలో ఒక్కమెతుకైన వేసుకొనరాదు. నాసేవకుడు అకలిబాధచేచచ్చిపోవనున్నాడు. అతని ఆకలి దీర్చినపిదపనే మీఆకలి దీర్చుకొనవలెను

జాక్కు—ఓహో, ఈపుంజు యెక్కడనుండి వచ్చినాడురా, దేవుడా!

రాజు—ఓయువకుడా—నీముఖముజూచిన నాగరికుడవగు బుద్ధిమంతునివలె గన్పడుచుంటివి. నీచేష్టలు జూచిన అడవిమనుష్యునివలెనున్నావు. నీకథయేమి? మాఅన్నమును కుమ్ములను తిననీయకుండుటకు నీవెవ్వడవు? మమ్మునిర్బంధించి నీఆకలిని తీర్చుకొనలేవు? నీకవసరమైనచో, మమ్ము బ్రతిమాలుకొనుము నీఅవసరము గడుపుదుము.

ఆర్లె—నేను అడవిలో నుంటినిగావున అడవిమనుష్యునివలె నగుపడుచుంటిని కాని, పుట్టుకచేత, పెంపుచే నాగరీకుడనే. ఇప్పుడు నేనును, నాసేవకుడగు ముసలివాడును ఆకలిబాధచే చావనున్నాము. కావున మాఆకలిదీర్చి మీఆకలిదీర్చుకొనుడు.

రాజు—మంచిది. అవశ్యము అట్లే కానిమ్ము. రమ్ము కూర్చుండుము.

ఆర్లెం—[సిగ్గుతో] అయ్యా - నాఆకలిబాధచే, మిమ్ము దండించితిని. మీరింత దయాళువులని యెరుగక, మిమ్ము మొదట నిర్బంధించితిని. నన్నుదయయుంచి క్షమించుడు. నాక త్తితిరిగియొరలోపెట్టుచున్నాను. పూజ్యులగు తమరెవరో, యిచ్చటికేల విచ్చేసితిరో నాకు తెలపీయ గోరెదను.

రాజు—ఓయుపకుడా, మేము నీవలె, పురవాసులమగు నాగరీకులమే. కాలకర్మవశమున, పట్టణవాసమును మాని యీ అడవిలో జీవింపవలసివచ్చెను. సరి లెమ్ము భుజించుటకు సిద్ధపడుము.

ఆర్లెం—స్వామీ, నన్ను క్షమించుడు. యీప్రక్కనే అలసి సొమ్మసిల్లి పడియున్న నాముసలి సేవకుని తీసుకొని వచ్చువరకును నేనుభుజింపను. మీరు తినుచుండుడు నేను పదినిముసములలో తిరిగి వత్తును. నాకొరకై వేచియుండ నక్కర లేదు.

అని ఆర్లెండో తన సేవకుని తీసుకొని వచ్చుటకై బయలుదేరి పోయెను.

పిదప రాజు తన విదూషకుడగు జాక్కునుజూచి 'జాక్కూ' యీప్రపంచములో నావంటి అభాగ్యుడు యింకెవ్వడును లేడనుకొనుచుంటిని కాని యిప్పుడీయువకుని జూచి, మనలాటి అభాగ్యులింకను ఉన్నారని సంతృప్తిగ నున్నది. అనెను. దానికి జవాబుగ జాక్కు రాజా, ఈప్రపంచమంతయు నొకనాటకశాల, అందలి ప్రజలందరును వేషధారులు. ప్రతిమనుజుడును ప్రవేశించుచునిష్క్రమించుచుండును. ప్రతిఒక్కడును ఏడుదశలు గలిగియుండి, ఆయావేషములు వేసుకొని, నాటకమాడి స్టేజివదలి వెళ్ళిపోవుచుండును. యీయేడుదశలలోను మొదటిది శిశుదశ. ఈదశలలో చిన్నపిల్లవాడై 'కేర్ కేర్' మని

యేడ్చుచు, తల్లిస్థనముల పాలుద్రావుచుండును. రెండవది బాల్యదశ. ఇందుబాలుడు విద్యను ప్రారంభించి, ఉదయమున నేలేచి, చల్దిభుజించి, ఎందుకువచ్చినదిరా భగవంతుడాయని, నెమ్మదిగా, కాళ్ళీడ్చుకొనుచు, తాబేలువలె, బడికిపోవును. మూడవదశ యౌవనము. జవ్వనియగు స్త్రీని రాత్రింబవళ్ళు తలచుకొనుచు, వెర్రిమొర్రిసంగీతమును పాడుకొనుచు. స్త్రీలబొమ్మలుజూచితృప్తియైన సంతృప్తిపడుచు, కనుసైగలు మొదలుగాగల కామవికారములచే బాధపడుచుండును. ఆపిమ్మట ఉద్యోగిదశ, అధికారాంధత అశాపిశాచము ఈదశలో బాధించుచుండును. అటుపైని విశ్రాంతిదశ. ఈదశలోఅధికారము అంతమై, సంసారము పెద్దదై యెంతసేపును, సంపాదించిన డబ్బుఖర్చుకాకుండ దాచనెంచుచు, విధిలేక ఖర్చుపెట్టుచు, సంసారము నీడ్చుకొనుచుండును. ఆరవదశ వార్ధక్యము. ఇందుపూర్తిగ మానవుడు కృంగి, కృశించి, గడచిన జీవితమునుగూర్చి విచారము చేసుకొనుచుండును. ఆఖరుదగు ఏడవదశ రెండవశైశవము. ఈదశలో మనుజుడు తిరిగి శిశువువలె మారును. పళ్ళూడిపోవును, కళ్ళుగ్రుడ్డివగును. ఇరువది నాల్గుగంటలును, శిశువువలె మంచముపై పండుకొని క్రింద కుంపటి పెట్టుకొనును. అన్నమును శిశువుకువలె ఇతరులు తినిపించవలెను. నడువలేడు. మాటలు సరిగా నుడువలేడు. రాజా, మానవుని జీవిత నాటకమిూ యేడువిధముల జర్గుచున్నది.

అని చెప్పి ముగించెను. అంతలో ఆర్లెండో, తన ముసలిసేవకుడగు ఆదామును భుజముపైని వేసుకుని తీసుకొనివచ్చెను. రాజు ఆదామును యిదివరకే యెరిగియుండెను కావున రాజు అతనిని మిక్కిలి ప్రేమతో జూచెను.

తదుపరి వారందరును సుఖముగా భుజించి ఒకరి చరిత్ర మరియొకరు తెలుసుకొనిరి. ఆరెండో, తన యెదుటనున్నవాడు, వృద్ధ

రాజని తెలియగనే, ఆయనకు అనేకకృతజ్ఞతా పూర్వకవందనము లర్పించినవా డయ్యెను.

ఇక పట్టణములోని విశేషములు చూతము. అట్లు చిన్నరాజుచే నాజ్ఞాపితురాలైన 'రోజలెండు' సీలియా టచ్స్టోనులతో, కోటను విడిచి పోయెను గదా. వారట్లుపోవుట చిన్నరాజు తెలుసుకొనినవాడై, రోజలెండు ఒక్కర్తెయు పోవుటకు మారు తన కూతురు సీలియా కూడ పోయెనేయని మిక్కిలి విలపించి, ఆయువతి సాహసమునకు మిక్కిలి తాపముపడెను. దీనికంతకును కారణము కు స్త్రీలో సామర్థ్యముజూపిన ఆర్లెండోయే దీనికుత్రపన్నియుండునని, అనుమానముగలిగి, అతనివిష యము, తెలుసుకొనుటకై అతని అన్నయగు ఆలివరుకోసము కబురు పంపగా, ఆలివరురాజు సన్నిధికి వచ్చినవాడయ్యెను. అంతట రాజు యిట్లు మాట్లాడజొచ్చెను.

రా—ఓయీ! నీతమ్ముడగు ఆర్లెండో యిప్పుడెచ్చటనున్నాడు?

ఆలి—అయ్యా. నా కాతని సంగతేమియు తెలియదండి. కొంత కాలమునుండి అతడు ఊరిలోనే అగపడుట లేదు.

ఈమాదిరిగ ఆలివరు సమాధానము చెప్పసరికి రాజు మిక్కిలి కోపోద్దీపితుడై, ఆలివరే ఆర్లెండోను యెక్కడో దాచియుంచెనని తలచినవాడై.

రా—ఏమనుచుంటివి? నీతమ్ముడు నీకగుపించుట లేదా? ద్రోహీ నిన్నేమి చేతునో చూడుము. ఇదిగో, వాడు ఎక్కడున్నను నా కవస రము లేదు. వానినిపట్టి తెచ్చుటి బాధ్యత నీపై యున్నది. నీవాతనిని కంచుకాగడాలతోనైన వెదికి తీసుకు రావలెను. బ్రతికియున్నచో సరి. చచ్చినాడనుకొనుము. ఆచచ్చిన కట్టెనైనను నాకు నీవు తెచ్చి చూప వలెను. నీకు గడువు ఒక సంవత్సర మిచ్చితిని. ఈలోపున నీవు నీ తమ్ముని నాకు జూపకున్న, నీయాస్థి నీకు జిక్కనీయకుండుటయే గాక నిన్ను నా రాజ్యమునుండి వెడలగొట్టెదను.

దుర్మార్గుడగు ఆలివరు తన తమ్ముని అన్యాయముగా ఇంటి నుండి గెంటెను. దాని పాపఫలితముగ నిప్పుడు, రాజుచే నిష్కారణముగ, నిట్టిదండన ననుభవింపవలసి వచ్చెను.

ఆలి—రాజేంద్రా, నాకును నా తమ్మునికిని యెన్నడును పడకుండెను. నాకు నాతమ్ముడు పరమవిరోధి. అట్టిచో అతని ఉనికివిషయము నాకెట్లు తెలుసును. దేవరవారు నన్ను మన్నించ ప్రార్థించుచుంటిని.

రా—ఛీ, రాజద్రోహి, ఈ దొంగ టక్కరి మాటలు కట్టిపెట్టుము. మీరిద్దరు అన్నదమ్ములైనప్పుడు, ఒకరి సంగతి వేరొకరికి తెలియదేమి? పొమ్ము, నా శాసనమునకు తిరుగులేదు. 'అని సేవకులను పిలిచి' ఓరీ మంత్రితో చెప్పి యీ ఆలివరు ఆస్థి నంతయు ప్రభుత్వము వశము చేయవలసినదని చెప్పుడు అనెను.

ఆలివరు దుఃఖించుచు, తమ్ముని వెదకుటకై బోయెను.

ఇక ఆర్లెండు సంగతి.

ఆర్లెండు అడవికి వచ్చినది మొదలుకొని రోజలెండును గూర్చియే ఆలోచించుకొనుచుండెను. ఆమె తనకిచ్చిన హారమును మాటిమాటికి జూచుకొనుచు, ఆమెకు తనయం దెంత వలపు గలదో యని యూహించుచుండెను. తాను దురదృష్టముచే నడవిపాలగుటయు నిక రోజలెండుకు తాను, తాను రోజలెండుకు, అగపడమని దుఃఖించుచుండెను.

రోజలెండును ఆర్లెండు పూర్తిగ ప్రేమించెను. ఆప్రేమచే నతని పిచ్చి యెత్తినట్లుండి, ప్రతి చెట్టుమ్రానుపైనను, రోజలెండును గూర్చిన పద్యములు వ్రాయుచుండెను. అవన్నియు నామె రూపలావణ్యములను స్తుతింపుచు వ్రాయబడెను. అడవిలో ఒక భాగమునుండి యింకొక భాగమువరకు యీవిధముగా ఆర్లెండు, తన ప్రేయసిపై

యుల్లిన పద్యములను, చెట్లపై చెక్కుచుండెనేగాని, తన రోజలెండు పురుషరూపమున నాయడవిలోనే వేఱొక భాగమున వసించుచున్న దని అతనికేమి తెలుసును?

ఇక రోజలెండు విషయము. అట్లు రోజలెండు సీలియాలుఅడవిలో నొకచెట్టుక్రింద శ్రమదీర్చుకొనుటకు గూర్చుండిరని చదివితివి. ఆపిదప నచ్చట నొక గొల్లవాని యిల్లు జూచినవాని సత్కారముచే వలస నేర్పరచుకొనిరి.

ఒకనాడు పురుషరూపమున నున్న రోజలెండును స్త్రీరూపమున నున్న సీలియాయును అడవిలో 4 భాగములును తిలకించుటకు షికారుగా బయలుదేరిరి. ఏగొల్లవాడుగాని, 'మీారెవరని అడిగినచో అన్నాచెల్లెలము అని జవాబిచ్చుచుండిరి.

అట్లు కొంతదూరమేగుసరికి, వీరిద్దరును చెట్లమొదళ్ళను బెరడులపై చెక్కబడిన రోజలెండునుగూర్చిన పద్యములు చూచి చదువుకొని ఆశ్చర్యపడిరి.

నావలపుకర్త రోజలెండ్ నాతి కివియె
పద్యపుష్పంబులను చెట్లపైకి జేర్చి
కానుకగా నర్పణముచేయ కానలోన
తిరుగుచుంటినితరుణిని నఱయలేక.
వృత్తివరులార ప్రేయసి రోజలెండు
నెక్కడేనియు గనినచో నెఱుగజెప్పు
డిందు నేనిట్లు కడువగ బొందితంచు
తిరుగుచుంటి నటంచును దిక్కులేక.

ఈవిధమగు పద్యములు ప్రతిచెట్టుపైన లిఖింపబడుట జూచినవారై యాయువిదలు యిట్లనుకొనిరి.

రో—అక్కా! ఇదేమిటే యీాచిత్రము. ఈఅడవిలో నా

మీద యిట్టి ప్రేమపద్యములు వ్రాయువారుందురా? ఇది కడువిచిత్ర ముగా లేదు టే?

అని సీలియా నడిగెను. సీలియా తొలినాటి సాయంత్రమే అడవిలో వేటకై తిరుగునప్పుడు ఆర్లెండో ను చూచుట తటస్థించెను. కాని ఆర్లెండో యీమెను జూచియు నానవాలు పట్టలేకపోయెను. సీలియాకూడ తాను తన్నెఱిగించుకొనక వూరకుండెను. ఈ కారణముచే, యీపద్యములు చెక్కినవాడు ఆర్లెండో యని సీలియాకు తెలియును.

సీ—రోజలెండూ, నిజమే నే, యిట్టిపద్యములు ప్రతిఒక్క చెట్టుపైని చెక్కుటకు ఎంతో ఓపిక కావలెనుసుమా. ఎవఁడని యూహింతువు?

రో—అయ్యో నాకేమి తెలుసును?

సీ—అబ్బా. ఎంత నంగనాచివే! నీకు తెలియకపోయిన, వూహించుకొననైన లేవు కాబోలు, పాపము!

రో—నీతోడు. నాకేమియు తెలియదు. నీవెవఁటినైనా జూచి నావా యేమి?

సీ—చూచితిని.

రో—మగవానినా! ఆడుదానినా?

సీ—రోజలెండూ. ఎందుకే యింత తాపత్రయము నీకు?

రో—అక్కా! అక్కా! తాపత్రయమనెదవా? నాపై యింత ప్రేమ యెవరు చూపెట్టిరో నేను తెలుసుకొనకూడదా? చెప్పవూ—అలిడేరంగువాడు—వయస్సెంత? మీసములు వచ్చినవా లేదా? చెప్పవూ?

సీ—నూనూగుమీసమున్నది. చామనచాయ—22 సంవత్సరములుండును.

రో—అక్కా—అక్కా! ఎవడే అతను?

సీ—కుస్త్రీ రోజయించి, చూపరుల మెప్పువడసి నీహృదయము చూఱగొని నీచే, కంఠహారమును బహుమతి వడసిన ఆర్లెండో.

అని చెప్పగనే, అత్యాశ్చర్యనిమగ్నయై, ఆర్లెండో యీఅడవి కెట్లు వచ్చెనా యని మొదట నమ్మక, సీలియా నమ్మించుటచే నమ్మినదై. తిరిగి

రో—నామీఁద ఒట్టేనా—ఆర్లెండోయేనా అతడు?

సీ—ఒట్టు నిజముగా ఆర్లెండోయే.

ఈమాట యిప్పటికి నమ్మినదై తాను పురుషరూపములో నుండుటచే లోన విచారించి,

రో—అక్కా యీమగవేషముతో నేలాగునే నేనాతని చూచుట? నీవు చూచినప్పు డతడేమిచేయుచున్నాడే? నీతో ఏమి చెప్పెను? ఏలాగు అగుపించెను? ఎక్కడకువచ్చెను? నా విషయమై అడిగినాడా? యింకా యిక్కడ వుంటాడా? నీతో ఏమిమాట్లాడెను? మళ్ళీ ఎప్పుడు కలుసుకొనెద నన్నాడు? అక్కా ఒక్క మాటలో నాకు జవాబు చెప్పవా?

సీ—వహ్వా వెయ్యినాలుకలుగల ఆదిశేషునైనను యిన్ని ప్రశ్నలకు జవాబు ఒక్కమాటలో చెప్పలేదు. నేను మనిషి నను కొంటివా నాలుగు తలల బ్రహ్మదేవుడి ననుకొంటివా?

రో—కాదే అక్కా నేనిక్కడున్నానని అతనికి తెలుసునా? తెలియదా? మొదట ఆనాడు మనము జూచినప్పటివలె—సంతోష ముగా నున్నాడా లేదా?

సీ—ఔనులే మోహావేశుల ప్రశ్నలకు జవాబిచ్చుట బ్రహ్మ తరముకాదు. సరిలే మనము ఇదివరలో చూచినప్పుడెంత ఉత్సాహ ముగా నున్నాడో యిప్పుడును అట్లేవున్నాడు.

రో—ఎక్కడ చూచితివి?

సీ—ఈ సమీపములోనే ఒక చెట్టుక్రింద రాలిన పండులాగ పడుకొన్నాడు.

రో—ఆహా! ఆ చెట్టు కల్పవృక్షమువంటిదిసుమా నాపాలిటికి అతడే దుస్తులు వేసుకున్నాడు.

సీ—వేటకాని దుస్తులు.

రో—అయ్యో! అతనివేట నాహృదయమును చండాడుటకు గాబోలు!

సీ—రోజలెండూ నీసొదయే నీదికాని క్రమమగు జవాబులు చెప్పనియ్యవేల?

రో—సీలియా! నా వేదన నీకు తెలియదే! మగవేషముతో నున్నమాత్రమున పురుషత్వము వచ్చునా? అబలనుగదా. కోపము పడక చెప్పుము.

ఇంతలో కాలిచప్పుడు వినవచ్చెను. ఆర్లెండోయును పెద్దరాజు అనుచరులలో విదూషకుడగు జాక్కును మాట్లాడుకొనుచు అలా వచ్చుచుండిరి. వెంటనే సీలియారోజలెండులు వెనుకకు తప్పుకొని వారి సంభాషణను ఒకచెట్టు వెనుకనుండి వినజొచ్చిరి.

ఆర్లెండో వృద్ధరాజును జూచినపిదప జాక్కుతో స్నేహము కలిసెను. జాక్కు వట్టి హాస్యగాడు. విదూషకుడు నక్షత్రకుడు లాటి వాడు. వారీవిధముగ మాట్లాడుకొనుచుండిరి.

జా—ఆర్లెండో నీవు చాలామంచివాడవు. గాని నీస్నేహముచే నాకు తలనొప్పి వచ్చుచున్నది.

ఆర్లె—నిజమే! నీవు చాలా బుద్ధిమంతుడవే. గాని నీస్నేహముచే నాకు పిచ్చి యెక్కువౌచున్నది.

జా—కనుక మనము ఎంత తరుచుగా కలుసుకోకుండ వుండిన అంతమంచిది.

ఆ—అసలు మనం యింతటినుంచి పెడమొగము పెట్టుకు తిరుగుతేనే మంచిది.

గ్లాండ్ అన్నట్టు నీ ప్రేయసి పేరేమిటి?

రోజలెండు.

చా! నాకా పేరేమీ నచ్చలేదు.

—నిజమే, ఆమె శారసాలనాడు ఆమె తలితండ్రులు నిన్ను సంతోషపెట్టడం ఉద్దేశంలేక యీపేరు పెట్టియుందురు.

జా—ఆర్లాండో, నీపిచ్చిపద్యాలతోటి యీచెట్లన్నీ ధ్వంసం చేస్తున్నావు వాటిమీద చెక్కుతూ,

ఆ—నీకు కష్టంగావుంటే, వాటిని చదవకు, నీలాటివాడు చదువుతే, పద్యాలగౌరవంకూడ పోతుంది.

జా—ఓయీ నిన్ను చూచుటకు ముందు నేనొక వెర్రిముండాకొడుకు చూచుటకు ఆలోచించుచున్నాను.

ఆ—అయ్యో! అలాగా! వాడిప్రక్కనున్న ఏటిలో మునిగిపోయాడు. నీవువెళ్ళి దానిలో చూడు.

జా—అందులో చూస్తే, నా మొగమే నాకగుపిస్తుంది.

ఆ—ఆం, ఔను, ఔను, అదే వెర్రిముండాకొడుకుమొగము

జా—ఓయీ నిన్నుచూస్తే నాకు ఒళ్ళు మండిపోతూంది, నేను పోతాను.

ఆ—నన్ను సుఖపెట్టినవాడవౌతావు. పో, జాక్కువెంటనే, పిచ్చిపిచ్చి పాటలు పాడుకొనుచు వెళ్ళిపోయెను.

వీరిద్దరి సంభాషణ ప్రక్కనుండివినుచున్న, పురుషరూపధారిణి యగు రోజలెండు. సీలియాతో యీవలకు వచ్చి ఆర్లాండోతో యిట్లనెను, అతడు వేటకాని దుస్తులను వేసుకొనెను.

రో—ఓయీ! ఆటవికుడా, ఇప్పుడెన్ని గంటలైనదో చెప్పగలవా.

ఆ—ఓయువకుడా, ఇది అడవియని యెరుగవాయేమి? ఎన్ని గంటలని అడుగుచున్నావు. ఇక్కడ గడియారములుండవు. గనుక ఎంతప్రొద్దెక్కినది అని యడిగిన బాగుండును.

రో—అట్లయిన, యీ అడవిలో గడియారపు గంటలు పగలవారు లేరన్నమాట.

ఆ—ఔను.

రో—ఐనచో, యిచ్చట నిజముగు ప్రేమగలవాడు లేడన వచ్చును.

ఆ—అదెట్లు చెప్పగలవు?

రో—నిజముగు ప్రేమగల యువకుడున్నచో, అతడు తన ప్రియురాలిని కలుసుకొనువరకును, గడియ యుగమువలె గడచుచుండును, నిముసములు గంటలు, పూటలు, లెక్కించుచునే యుండును.

అర్లెండో, యువకునిరూపమును చూచి, యీరోజలిండుమాట కాశ్చర్యపడి యిట్లనెను.

ఆ—ఓయువకుడా, నీవు [illegible] యీ అడవిలో నేనా?

రో—ఔను. [illegible] కొన్నాళ్లాయెను. మేమిద్దరము యీసమీపములోనే వసించుచుంటిమి. [illegible] చెట్లపైని రోజలిండునుగూర్చి పద్యములు చెక్కబడినవి. [illegible] రసికుడెవ్వడో నీవెరుగుదువా?

ఆ—ఓయీ! నేనే ఆగ్రంథకర్తను. రోజలిండు నాప్రేయసి—ఆమెకొరకు వేదనపడుచుంటిని.

రో—ఏమీ! నీవామె నంతగా ప్రేమించితివా?

ఆ—ఔను.

రో—నేను నమ్మను. అంత యెక్కువగా ప్రేమించిన యువకుడు యీరీతిగ నుండడు

ఆ—మరియెట్లుండును?

రో—ప్రేమచే దిగులుపడువాని దవడలు సన్నగిలును. నీవి అట్లులేవు. అతని కన్నులు గుంటలుపడును. నీవి అట్లులేవు. అతని గడ్డము అశ్రద్ధగా వదలబడును. నీది అట్లులేదు. అతనివస్త్రములు చీకా